# మానసగీతము

తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు

కలమును గదల్ప మేధావి కాన మూన్పఁ
బనులఁ గల్పింపఁ గవులకుఁ దనరుదాని
నరయ మనసయ్యె ; మనసయ్యె నరయ నదియె ;
అది యయ్యెను జగమున కంత కదియె.
దానిఁ బట్టి బయల్ వెట్టఁ దలఁపు గలిగె ;
బాహిరంబున కాంతర ప్రకృతి కదియె
మూలకారణమై చెల్లు మూర్తి యయ్యె.
అఖిలమతములవారు తదాస్తికతను
నొప్పుదురు ; దీనికిని గూడ నొకటి గల్గు
మూలప్రకృతి యటంచును జాల నరసి
పల్కు మతములు నున్నవి ; పట్టి చూడ
నావిభేదముల నటుంచి యంద రైక
మత్యముగ నొప్పికొనినట్టి మతమునకును
మూలమైనట్టి మనసును లీలలకును
పాత్రముగఁ జేసి వెలిఁ జూప బ్రహ్మ వశమె ?
ఎవని గుట్టు బయల్ వెట్ట నెవని కగును ;
బలుకఁ బలికింప నూహ యుద్భవము సేయఁ
దాని కర్తయుఁ గారయితయును నగుచు
వెలయు మన సది, తన చిత్తవృత్తిపగిది.
బయలుపడెనను లోలోనఁ బ్రబలియున్న
మెలఁగునదె కాని యొరుచేత మెలగునదియె ?
చిద్విలాసంబుగను నాదు బ్రహ్మనుండి
తన విలాసంబు నొకయింత గనుపఱుపఁగ
నాంతర ప్రకృతుల తత్త్వ మరయఁగోరు
వార లగుదు గా దన నిచ్చపడితొ యేమొ
యిట్టి సంకల్ప మొదవించె నిచ్చ నొకటి ;
కరము చంచల మగు దీని గతులఁ గనినఁ
జంచలత తామరాకున సలిలమునకు
ఘనతమం బని చాంచల్యగరిమ కెపుడు
నుపమగాఁగ గణించిరి నిపుణమతులు ;
వారి పల్కులు మృషలు గావలయు దీని
గతులఁ జాంచల్యమును సరిగాఁ గనంగ ;
నెంతలో బుద్ధి మాఱునో యెఱుఁగరాదు ;
తలఁపు లిప్పుడు తనుఁగూర్చి నిలిపె మదిని ;
పురికొలుపుచుండె నది వెలిఁబుచ్చ మనుచుఁ ;
గాలవైలంబ్య మొకయింత గాక యుండ
వెడలఁబుచ్చఁగవలె మనోవేగమునను ;
కల మల మనోగతిని బోవఁగలదె యెంత
వడిగ వ్రాసెడి లేఖకు వ్రాఁతకైన ?
కలము కొలపాత్ర, జలధులు తలఁపు లెన్న ;
నెంత వశమౌనొ దానికి నంతవట్టు
పాఠకవిమర్శనకుఁ దెచ్చి పాలుపఱుతు ;
పాఠకమహాశయులు మీరు పట్టు విడక
మీ మనోనుభవంబులమీఁద దృష్టి
నిలిపి వినుఁడయ్య మాపల్కు నిజము దెలియఁ ;
గన మనోదృష్టి సమభావమునఁ జెలంగ
దేమి చిత్రమొ ! తెలియరా దెవ్వరికిని ;
ఇంద్రియంబుల నరికట్టి యిహసుఖముల
యాశ దిగఁద్రోసి యతులైన యయ్యులైన
మనసును జయింప లేరైరి మానదయ్యొ
విషయపర్యాకులత బ్రహ్మవేత్తలకును ;
విషయము లనంగ నెయ్యవి వీని జన్మ
సీమ యెయ్యది ? యనుచుఁ బ్రశ్నించువారె ?
మనసు నడుగుడ మది పుట్టి మనికిఁ గన్న
తావు తా నౌనొ వేఱొక్కతావ మగునొ ?
ఉభయపక్షంబులందుఁ బ్రశ్నోత్తరముల
కన్నిటికి నన్నె కర్తగా నరయువారె?
మనస ! యొక్కింతసేపు నా మాట వినుము

నీ రహస్యంబు లోకకొన్ని జారవిడుము;
నిన్నుఁగూర్చిన గీత మానించు నెడల
లోటు వచ్చిన నదియు నీ లోటు గాదె?
యెటను ఛాయాపటముఁ దీయు నెడ నొకింత
ప్రకృతిరూపంబు నెదరినఁ బనులవాని
నేర్పు కొలఁదైన ఫలము గణింప నొక టె
పటము నైరూప్యమును బొంది పాడుపడుట,
నిన్నెఱుంగనివారు నిందింత్రు నిన్ను;
నెఱుకఁ గలవార లంద్రు నన్నె మనిసను;
వారెఱుంగరే నేను నీ వశత నుంట?
కాన లోకుల్ల నాదిగాఁ గాన రెవరు;
కేవలస్వాతంత్ర్య మటుంచి భావిఁ జూచి
యతురఖ్యాతి గనువారి యండ గనుము;
అన్నియును గూడఁ జక్కనై యలరు నపుడు;
భారతీదేవి సాయంబుఁ బడయరాదె?
తోడఁ బనిసేయుచుండు నీ కూడ నుండి,
యవయవంబులు మనస! నీ కఖిలవిషయ
సంచయంబును; నీవెగా జన్మభూమి
యింద్రియంబుల కన్నింటి కెటులు గనినఁ;
దత్సహాయమున జగ మంతయు జయింతు;
వెలుపలను గల్గు సఖలంబుఁ దెలిసికొనుచుఁ
బట్టి లోపలి కీడ్చుచు బలిమినో చను
వునో యొప్పగించెదు లోనె పనులు సేయు
వానికిని గొన్ని యవియె గా బాహిరములు;
అంతరంగములోఁ గొన్ని యమరియుండి
చక్కఁజేసెదు పను లెల్ల జగతియందు;
లోన వేఁపల నవి యేమి లోఁగొనినను
నెంతె యవ్యగ్రముగ నవి యొసఁగుచున్న
నీకుఁ జిత్తంబు రానిదే నిలువ దెదియు;
నేది గనుచున్న వినుచున్న నెచట నీకుఁ
దలఁపు పుట్టునో యది తక్క నొకటి
బుద్ధి కెక్కదు; నీ భావమును గ్రహించి
యంతరంగానుచరులు; బాహ్యానుచరులు
నాడిగము సేయవలయు నీ కొప్పిదముగ
అందఱును నీకు వశవర్తులై మెలంగు
చుందురే గాని లోనుగా వ్వరి కీవు;
సర్వతంత్రస్వతంత్రు లేజగతి నైనఁ
గలరె నీవంటివార లొక్కరును గాన?
స్వేచ్ఛ నినుఁ జెప్పి మఱి యన్యుఁ జెప్పవలయు;
యతులు సామ్రాజ్యపట్టభద్రాయతులును
గడు స్వతంత్రు లటంచుఁ బేర్వడినవారు;
వారిపై నాధిపత్యంబు వఱలు నీకు;
నింతకంటెను స్వాతంత్ర్య మెటను గల్గు?
పార్థివులు ప్రకృతిచేఁ దుష్టిపడనివారు
వారిపైన నీ వధికారపథము గనుట,
వింత గాదనఁగు నొక విధము గాఁగ;
నీదు పరివారమును గెల్చి నిను జయింప
నేకదీక్షగఁ బనిసేయ నెసఁగువారు
అదియె నియతిగఁ గలవారు యతు లనంగ;
శమదమాదులఁ బరివారసరణిఁ గాంచి
శాంతిసాధనములను దుర్దాంతు లగుచుఁ
బట్టి బంధించి నీ పరివారములను
ముట్టడింతురు వా రదికట్టి నిన్ను
నిను వధించి లోకజ్ఞ సన్యాని వధింప
వలెను శత్రుఁడు పైఁజేయి గలిగియున్న
నొదిగియుండుము సమయంబు పొదలుదనుక;
పట్టియుంచిన కొన్ని చేపట్టి సడల
రివ్వనను దొల్లిటికి నూరు రెట్లు వడిని
మింటి కెగసెడు క్రియ వారిమీఁద మరల
నీదు నధికారవిభవంబు నెఱపుచుందు.
అణువు నీ రూప మాకాశమంత యాశ
యాశలకు నెల్లఁ గూటస్థురాల వీవ
యఖిలయోజనలకు మూల మగుదు వీవ
పాపపుణ్యంబులకు నుక్కుపట్టు వీవ
మూఁడు లోకంబులును గాలములును గూడ
నెఱుఁగఁగలదాన వీవ; నిన్నెఱుఁగనగునె?
గతము దెలిపెడి తతి నిన్ను స్మృతి యటంద్రు;
మఱి యటందురు భావిసంగతుల నున్న

నీ రహస్యంబు లోకకొన్ని జారవిడుము;
నిన్నుఁగూర్చిన గీత మానించు నెడల
లోటు వచ్చిన నదియు నీ లోటు గాదె?
మెటను ఛాయాపటముఁ దీయు నెడ నొకింత
ప్రకృతిరూపంబు నెవరినఁ బసులవాని
నేర్పు కొఱనైన ఫలము గణింప నొకట
పటము నైరూప్యమును బొంది పాడుపడుట,
నిన్నెఱుంగనివారు నిందింత్రు నిన్ను;
నెఱుకఁ గలవార లంద్రు న న్నే మనినను;
వారెఱుంగరే నేను నీ వశత నుంట?
కాన లోకుల్ల నాదిగాఁ గాన రెవరు;
కేవలస్వతంత్ర మటుంచి భావిఁ జూచి
యతుల ఖ్యాతి గనువారి యండ గనుము;
అన్నియును గూడఁ జక్కనై యలరు నపుడు;
భారతీదేవి సాయంబుఁ బడయరాదె?
తోడఁ బనిసేయుచుండు నీ కూడ నుండి,
యవయవంబులు మనస! నీ కఖిలవిషయ
సంచయంబును; నీవెగా జన్మభూమి
యింద్రియంబుల కన్నింటి కెటులు గనినఁ;
దత్సహాయమున జగ మంతయు జయింతు;
వెలుపలను గల్గు సకలంబుఁ దెలిసికొనుచుఁ
బట్టి లోపలి కీడ్చుచు బలిమినో చను
వునో యొప్పగించెదు లోనె పనులు సేయు
వానికిని గొన్ని యవియె గా బాహిరములు;
అంతరంగములోఁ గొన్ని యమరియుండి
చక్కఁజేసెదు పను లెల్ల జగతియందు;
లోన వెలుపల నవి యేమి లోఁగొనినను
నెంత యవ్యగ్రముగ నవి మొసఁగుచున్న
నీకుఁ జిత్తంబు రానిదే నిలువ దెదియు;
నేది గనుచున్న వినుచున్న నెచట నీకుఁ
దలఁపు పుట్టునో యది తక్క నొకటి
బుద్ధి కెక్కదు; నీ భావమును గ్రహించి
యంతరంగానుచరులు; బాహ్యానుచరులు
నాడిగము సేయవలయు నీ కొప్పిదముగ
అందఱును నీకు వశవర్తులై మెలంగు
చుందురే గాని లోనుగా నొకరి కీవు;
సర్వతంత్రస్వతంత్రు లీజగతి నైనఁ
గలరె నీవంటివార లొక్కరుడు గాని?
స్వేచ్ఛ నినుఁ జెప్పి మఱి యన్యుఁ జెప్పవలయు;
యతులు సామ్రాజ్యపట్టభద్రాయతులును
గడు స్వతంత్రు లటంచుఁ జేర్వడినవారు;
వారిపై నాధిపత్యంబు వఱలు నీకు;
నింతకంటెను స్వాతంత్ర్య మెటను గల్గు?
పార్థివులు ప్రకృతిచేఁ దుష్టిపడనివారు
వారిపైన నీ వధికారపథము గనుట,
వింత గా దనఁగ నొక విధము గాఁగ;
నీదు పరివారమును గెల్చి నిను జయింప
నేకదీక్షఁ బనిసేయ నెసఁగువారు
అదియె నియతిగఁ గలవారు యతు లనంగ;
శమదమాదులఁ బరివారసరణిఁ గాంచి
శాంతిసాధనములను దుర్దాంతు లగుచుఁ
బట్టి బంధించి నీ పరివారములను
ముట్టడింతురు వా రదికట్టి నిన్ను
నిను వధించి లోకజ్ఞ సన్న్యాసి వధింప
వలెను శత్రుఁడు పైఁజేయి గలిగియున్న
నొదిగియుండుము సమయంబు పొదలుదనుక;
పట్టియుంచిన కొమ్ము చేపట్టు సడల
రివ్వనను దొల్లిటికి నూరు రెట్లు వడిని
మింటి కెగసెడు క్రియ వారిమీఁద మరల
నీదు నధికారవిభవంబు నెఱపుచుండు.
అణువు నీ రూప మాకాశమంత యాశ
యాశలకు నెల్లఁ గూటస్థురాల వీవ
యఖిలయోజనలకు మూల మగుదు వీవ
పాపపుణ్యంబులకు నున్కిపట్టు వీవ
మూడు లోకంబులను గాలములను గూడ
నెఱుఁగఁగలదాన వీవ; నిన్నెఱుఁగ నగునె?
గతము దెలిపెడి తఱి నిన్ను స్మృతి యటంద్రు;
మఱి యటందురు భావిసంగతుల నున్న

బుద్ధి పోదు తాత్కాలికముగ మెలంగ ;
వంద లామడలను దూరమందు నున్నఁ
గనని విననట్టి వస్తులఁ గాంతు వీవ;
కాలజలనిధి నడుఁగంటి గ్రాలుచున్న
యర్థములఁ దెచ్చి యెదుటఁ బ్రత్యక్షముగను
వఱలఁ జేయుదు ; వెదుటఁ గన్పడుచునున్న
వారిఁ గనకుండఁ జేతువు; దూరభార
మనెడి మాటలు లేవు; దాపనుచు లేదు;
మిత్రుఁ డని లేదు; లేదు బల్ శత్రుఁ డనుచు
సర్వసమురాల నిను నమ్మి చనఁగరాదు
నీదు సాంగత్యమును నమ్మి నెగడువారి
మనసువచ్చిన రీతిని మనెడువారి
వర్తనము బోధపడునె యెవ్వరికి నైన ?
ఒకని వృత్తంబు నొకరీతి నుండనీవు
మిత్రులను శత్రులుగఁ జేసి మెలపుదువు
మిత్రులుగఁ జేతు త్రుటిలోన శాత్రవులను;
మంచిఁ జెడ్డగఁ జెడుగుల మంచివిగను
గనుఁగొనఁగఁ జేతు భ్రమ యనుకొనకయుండఁ
దిరుగులేనట్టి మందిచ్చి త్రిప్పుచుందు;
మందు తల కెక్కెనా, లవమాత్రమైనఁ
దిరుఁగు మఱుఁగగు మఱుఁగగుఁ దిరుగు జగతి
సాధుసాంగత్యమునఁ ద్రోవఁ జనెడువారి
దారి దప్పించి మెలపంగఁ దప్పుత్రోవ
నరుగువారల నడుగంట నణఁగఁద్రొక్కి
బయటఁబడకుండఁజేయఁ జాల్పడుదుమందు
వ్యసనములలోఁ దగుల్కొనువారిఁ గనుఁడి.
దినదినంబును వృద్ధిగాఁ దనరుఁ గాని
తిరుగు గనరాదు ; నుడిబడి తిరుగుచుందు ;
స్నేహ మని నిముసము నమ్మి చెలఁగలేరు
వైరభావంబువలన లాభమును లేదు
ప్రకృతి యగు నీదు దుష్ప్రవర్తనంబు
సత్ప్రవర్తనకును నీకుఁ జాల దవ్వు,
అడుగు పడ దేలొకో నీదు నడలగతుల
నొక్కపట్టునఁ ; జప్పునఁ జిక్కఁబోదు
వెగుబుజంబున కాపథ మగపడఁగనె
నీదు పల్లమునకు నేగు తీరు గాఁగ
అందువనె నిన్ను మాయకు నాత్మజ వని
యాస్తికమతావలంబులై యలరువారు
పరమమతిఁ జూచి సిద్ధాంతపఱచినారు ;
జడ మటందురు తాత్త్వికజ్ఞానమతులు
నిన్నుఁ గొందఱు ; లే దండ్రు నీకు స్వప్ర
కాశతయె కొంద ; ఱిందలి కల్ల నిజము
లరయ శక్తు లెవ్వరు? స్వయంవ్యక్తి వగుదొ
ఛాయ వయ్యెదవో చెప్పఁజాల మమ్మ!
ప్రకృతిచాంచల్యము భవత్స్వభావ మరయ
దాని యనుభవమునుబట్టి నీ నడవడు
లరసి చూచిన ఛాయవే యనుచుఁ దోఁచు ;
లేకయుండిన స్థైర్యంబు లేద దెట్లు?
అందుచే స్వయంవ్యక్తి గా వండ్రు నిన్ను
మూల మున్నది నినుఁ ద్రిప్పఁజాలునద్ది;
అదియె యాస్తికు లెల్లరు నాత్మ యండ్రు
నీకుఁ గూడను మూలమై నెగడు దాని
హాస్తవటఁ జేసి యాడింతు వనవరతము;
వింత యగుఁగాదె యిది మాయవిధముగాదె?
ఆత్మ యద్ద మగును మెఱుఁ గగుదు వీవు.
నీదు సంగతిచే నాత్మ నిశ్చయంపు
స్థితిని నేమఱుచుండె, నీ గతియె గతిగ
నలరుచున్నది, కల్ల యథార్థ మనుచు
భ్రమను బడి దిరుగుచున్నది విమతి మగుచు;
చటులసాంగత్యదోష మెంతటికిఁ గాదు ?
అద్దమున మెఱుం గెటు లుండు నటులు గాదె
మొగము గన్పడు? నొకవంక మొగము పెద్ద
దొకటఁ జిన్న దొకటఁ గోల యొకట గుండ్ర
దొకట బుంగగ నుండెడు నొకటఁ జక్క
శల్యముగఁ గానఁబడుఁ గాని సహజరూప
మెప్పుడో గాని కన్పడ దేర్పడంగ;
ఒకని మనమును బోలి వేఱొకని చిత్త
మలర దేలొకో బుద్ధి జీవులకుఁ గల్గు

మనము లన్నిటికిని లోన మమత గలదు;
స్నేహభావంబున నొకనిఁ జేరఁబోవ
నాదరంబుగఁ గను వాని నాతఁ డపుడు;
వైరభావంబునను బొమ్ము వానికడకుఁ
దెప్పుకొమె దాని నాతఁడు చెప్పికొనును;
త్రాఁగుఁబోఁతులఁ గను మొక్కత్రావునందె
గానఁబడుదురు; జూదరుల్ కల్లరులును
స్వచ్ఛమతులును నొక్కొక్క స్థలమునందె
చూడనయ్యెద రెప్పుడుఁ గూడఁ గూడ
వారికిని వీరికిని జెల్మి వఱల దెపుడు;
మంచికిని జెడ్డకును జెల్మి మనఁగనగునె?
భాష చెల్మియు దేశంబు బాంధవంబు
లేనివారలు గూడ లోలోనఁ జాల
నాప్తభావంబు గల్గి యన్యోన్యమైన
మైత్రి మెలఁగుచుందురు తత్స్వమాగమమును
నానుషంగికమే యగు నరసి చూడ;
మనసు లాకర్షణము లేక తనరు నేని
నొకవిధంబైన వన్నియు నొకటఁ జేరఁ
గారణం బెట్లు చూచినఁ గానరాదు
నిన్ను పురుషునిఁగాఁగ గణించినారు
తాత్వికులు దానిని యథార్థతను వచింపఁ
జన దనుచుఁ దోఁచు; హేతు వే మనుదు వేమొ
తనదు చిత్తానువృత్తి నందటను ద్రిప్పఁ
సభ్యతపు శక్తి యొక్క స్త్రీయంత్రమునె
గాని యా శక్తి గన మఱొక్కడను లేదు;
అందుననె మూఁడు మూర్తుల కాదికీవ
మయిన శక్తి యొకం డుండు నాదిననిరి.
అట్టి శక్తులు నీయందు నమరియుంట
స్త్రీత్వ మారోపణము చేసి చెప్పినాము
స్త్రీత్వపుంస్త్వంబు లేర్పడఁ జేయ నెవరి
కగును? దోఁచిన క్రియఁ జెప్పనగును గాని;
ప్రకృతిని నపుంసకత గల్గి ప్రధనమంది
పుంస్త్వమును బొంది విజ్ఞానపూర్ణులకడ
స్త్రీత్వ మందితి విచట నీ చేష్టితముల
స్త్రీత్వపుంస్త్వనపుంస్త్వముల్ చేరి యొకట
నుండు నిచట జగత్కర్తయొద్దఁ దక్క?
నందుననె నిన్ను జగమున కాది గాఁగఁ
జెప్పియున్నారు; జగతియుఁ దెలియు నటులె.
స్త్రీ లొకొక్కపుడు తమంత హేల గాఁగ
నెందుకును గానివానిపై నచట లేని
కూర్మి గలిగి మెలఁగుట కూడఁ గలదు;
అట్లె యొప్పుడైన నీకు దయార్ద్రభావ
మొదవుటయు నుండు నెవ్వరో యొకనిపైన
నపుడు సద్వృత్తివానికి నమరుచుండు
వారి వశవర్తినివిగాఁగ వఱలుచుండి
ముక్తికాంతకు వానిపై మోహ మలరఁ
జేసి నిర్వాణపదయుక్తుఁ జేతు వతని;
నట్టి దయఁ జూపుమమ్ము మాయందు నెపుడొ;
నీకుఁ గృప వచ్చినప్పు డందాక మాత్ర
మిటునటును ద్రిప్పి దుర్గతి కీడ్వకమ్మ!
అఖిలభ్యాలి జగతి నీ కమరునమ్మ!

శా. మా జాడ్యము పరాక్రమాగ్నిశిఖ యుద్యజ్జాతజాడ్యావళీ
తూజాలానిల మూగుచుండఁగ రిపుత్యాగార్థ త్తలం దంతటన్
బేజారై కలభాకృతిం బడసి భస్మీభూతు లౌనట్లుగా
వేఁ జేయుర్ భువి శ్రీజనార్దను నినుర్ విష్ణుర్ భజింతుర్ మదిర్.

# ఐరోపా మహాసంగ్రామము

## ప్రస్తావన

శ్లో. తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ - జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధం
మయైవైతే నిహతాః పూర్వమేవ - నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్. ౧౧-౩౩.

మహాసంగ్రామము బడబానలమువలె నాగరకప్రపంచము నావరించినది. యుద్ధము సకలారిష్టములకు మూలము. ద్రవ్యనష్టము, సుఖనాశనము, జనసంక్షోభము, ప్రజాక్షయము, సర్వసంహారము యుద్ధఫలములు. యుద్ధప్రకటనము రాజులకు భయమును, మంత్రులకు కంపమును, యోధుల కుత్సాహమును, శాంతికాములకు నిరాశను, ఆగ్నేయాస్త్ర నిర్మాతల కానందమును, లోభుల కాశావేశమును గలిగించెను. జనులు గుంపులు గుంపులు గూడి గుసగుసలాడఁ గడంగిరి. పండితులు పామరులు కలహకారణంబులను చర్చింప నుపక్రమించిరి, కలహకారకులను నిందించుచుండిరి. కొందఱు ఆస్ట్రియాయువరాజును యువరాజ్ఞిని చంపిన సర్వియా యువకుని నిందించిరి. కొందఱు చిరకాలముగ సర్వియనులను దౌర్జన్యముపాలు సేయుచున్న ఆస్ట్రియనులు మూలకారకు లని నిందించిరి. మఱి కొందఱు సజాతీయులైన సర్వియనులకు చేయూఁత నొసంగిన రుష్యా కారణ మనిరి. మఱికొందఱు ఆస్ట్రియాకు భయహస్తము నిచ్చి స్వలాభమునకై కయ్యమునకు పురికొలిపిన జర్మనిని దూషించిరి. మఱికొందఱు పగను సాధించుటకై వేచియున్న ఫ్రాన్సు కారణ మనిరి. ఇతరులు చిన్నరాజ్యములను లోకసామ్రాజ్యమును గాపాడుటకై ఇంగ్లాండవలంబించిన ధర్మమార్గమనిరి. కారకు లెవ రైనను రాజనీతి కవమానకరం బైన యుద్ధము పొసఁగినది.

రుద్రుఁ డవతరించెను. విలయమున కేర్పడిన యాయుధములను ధరించెను. లయభారమును వహించెను. లయరూపంబు లైన ఝంఝానిలంబులకును, బడబానలంబులకును, జలప్రవాహంబులకును, భూకంపంబులకును, మహావ్యాధులకును కారణభూతుం డైన రుద్రుండు సంగ్రామరూపం బైన లయమునకును కారకుండు. ఇతరకారణములు నిమిత్తమాత్రములు.

అనంతదయామయుం డైన సర్వేశ్వరునకు భయానకం బైన రౌద్రావతారం బేల? ధర్మమూర్తికి నిరపరాధి దండనం బేల? విశ్వంభరునకు విప్లవవినోద మేల? దీనరక్షకునకు దీనసంహార మేల? సృష్టికర్తకు లయలీల లేల?—అను విషమసమస్యలు లోకవైచిత్ర్యమును పరిశీలించుటవలనఁ గలుగుచున్నవి. ఇట్టి సమస్యలకు సమాధానము సమస్తసృష్టిపరిణామమువలన గ్రాహ్యము కాఁగలదు గాని ప్రత్యేకకారణము నుపపాదించుటవలన గ్రాహ్యము కాఁజాలదు. జీవాత్మ పరిణామమునకు లయపరంపరలు సోపానంబులు. లయము అవస్థాభేదము గాని నాశనము గాదు.

శ్లో. న జాయతే మ్రియతే వా కదాచిత్
నాయం భూత్వా భవితా వా న భూయః।
అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే. ౨-౨౦.

సృష్టి లయము ననుగమించియుండును. ప్రాచీనభావప్రపంచమును రూపుమాపి నూతనభావప్రపంచమును నిర్మించుటకు వర్తమాన మహాసంగ్రామమును సాధనంబుగఁ గైకొనుట భగవత్సంకల్పము గావచ్చును. కార్యకారణసంఘటనము దుర్లభ మైనను జీవాత్మపరిణామమునకు లయమును సృష్టివలె మూల మని నమ్మవలసియున్నది.

ఈసంచికయందు కలహకారకము లైన ఫ్రాన్సు,

బెల్జియము, జర్మని, రుష్యా మొదలగు రాజ్యముల చరిత్రములు సంక్షేపముగ వ్రాయఁబడినవి. ఆ చరిత్రలను పరిశీలించినపుడు భిన్నరాజ్యముల శ్రేయఃప్రాప్తికి, రాజ్యాభివృద్ధికి, వ్యాపారాభివృద్ధికి ఘోరము లైన యుద్ధములు తఱచుగ జరిగినట్లు తెలియుచున్నది. యుద్ధానంతరము భావప్రపంచమునందు మార్పులును ఏర్పడుచుండెను.

యుద్ధములకు మొదటియుగమునందు దేశస్వాతంత్ర్యము, మధ్యమయుగమునందు మతస్వాతంత్ర్యము, తుదియుగమునందు ప్రజాస్వాతంత్ర్యము కారణములు. రాజ్యస్వాతంత్ర్యయుగమునం దా కారణము పరిస్ఫుటము; తక్కిన భావము లంతర్గతములు. ఇట్టి నిర్ధారణము మూఁడు యుగములకును సమన్వయించుచున్నది.

గ్రీకులు మొదట యూరపుఖండమునందు నాగరకాంకురములను నాటిరి. గ్రీకులకు విశ్వాత్మ సుందరాకారము. అయ్యది ప్రకృతియందు దృష్టము. గ్రీకులు నాగరకులు. తదితరు లనాగరకులు. రక్తబాంధవ్యమె దేశబాంధవ్యము, జాతి బాంధవ్యము. రోమనులకు విశ్వాత్మ ధర్మమూర్తి. అయ్యది సామ్రాజ్య వ్యవహారములందు పరిస్ఫుటము. రోమక సామ్రాజ్య వాసులు నాగరకులు. తదితరు లనాగరకులు. సామ్రాజ్యవాసము జాతిబాంధవ్యము, దేశబాంధవ్యము. కాన్స్టెన్‌టైను చక్రవర్తి క్రైస్తవమతమును స్వీకరించిన పిదప మతబాంధవ్యము సామ్రాజ్యవాసబాంధవ్యమును బలపఱచెను. క్రైస్తవులు నాగరకులు, సజాతీయులు. తదితరు లనాగరకులు, విజాతీయులు. ఏకదేశవాసము, ఏకభాషాప్రచారము, ఏకమతావలంబనము మొదలగు చిహ్నము లేకజాతీయతకు నిదర్శనములుగ నుండెను. పదునాఱవ శతాబ్దమునందు మతభేద మేర్పడి మతకలహములు ప్రబలినవి. దేశములు సంక్షోభవశ మైనవి. పదునేడవ శతాబ్ద మంతమునందు మతస్వాతంత్ర్య మేర్పడినది. యూరపు రాజ్యములు భిన్నరూపములను దాల్చినవి. పదునెనిమిదవ శతాబ్ద మంతమునందు ప్రజాస్వాతంత్ర్యమునకై పరివర్తన మేర్పడినది. పందొమ్మిదవ శతాబ్దమునందు యూరపురాజ్యములలోని ప్రజ లధికారదాస్యమునుండియు ఆచారదాస్యమునుండియు మతదాస్యమునుండియు విముక్తులై, మానవసమత్వమును సౌభ్రాతృత్వమును స్వాతంత్ర్యమును స్థాపించిరి. కాని, సిద్ధాంతమునం దీభావము లంగీకృతములైనను వారికయందు వ్యక్తిస్వాతంత్ర్యమునకును జాతీయ స్వాతంత్ర్యమునకును బల సంపదలు మాత్రమె కారణములుగ నున్నవి. పాశ్చాత్య రాజ్యములు మతాభిమానమును నాగరకాభిమానమును బూని మహా సామ్రాజ్యములను నిర్మించి శాంతిని స్థాపించి లోకప్రఖ్యాతిని గడించినవి. యూరపియనులు నివాసయోగ్యము లైన ప్రదేశములను విజయమువలననో నివాసమువలననో ప్రతిగ్రహణకారణముననో యాక్రమించుకొనిరి. ఇపుడు ఇంగ్లాండు 1,31,53,712, రుష్యా 84,00,000, ఫ్రాన్సు 53, 66,400, జర్మని 13,37,020, అమెరికాసంయుక్తరాష్ట్రములు 37,48,100 చదరపు మైళ్ల భూభాగము నాక్రమించుకొనియున్నవి.

మఱియు పందొమ్మిదవ శతాబ్దమున యూరపుఖండమునందు జనసంఖ్య హెచ్చినది; యంత్రసాధనములవలన పరిశ్రమలు విపరీతముగ వృద్ధిపొందినవి. యూరపునందు పరిశ్రమయుగ మేర్పడినది. ధనాశ ప్రబలినది. వ్యాపారవైరము హెచ్చినది. విషయలోలత్వము వ్యాపించినది. టాల్‌స్టాయి ప్రభువు వ్రాసినట్లు యూరపురాజ్యములందు ధనదేవత యిష్టదేవతయై వెలసినది. ధనదేవతను గొలుచువారలకు సంతృప్తి దుర్లభము. యూరపురాజ్యములందు రాజ్యవైరములకు వ్యాపారవైరము జతపడ, ప్రబలవైరము వర్ధిల్లుట కారంభమయ్యెను. భావప్రపంచమును భౌతికప్రపంచము వశపఱచుకొనెను. భావప్రపంచము క్షీణించినపుడు జీవాత్మపరిణామము వెనుకఁబడును. యూరపియను జాతులు భౌతికాడంబరములందు చిక్కుకొని భావార్థములను నిరసించినవి. యూరపుజాతులందు వ్యక్తిసౌభ్రాతృత్వ మంగీకృత మైనది కాని జాతీయసౌభ్రాతృ

త్వ మంగీకృతము గాలేదు. చిన్నదేశములను ఛిన్నభిన్నమొనర్చుట పెద్దరాజ్యములందు బలివిని చేర్చుకొనుటయు యూరపురాజ్యముల రాజనీతి. నిస్సహాయుఁడైన వ్యక్తిని గాపాడుట మానవధర్మము; నిస్సహాయస్థితియందున్న జాతిని రక్షించుట ధర్మవిరుద్ధము. జాతిస్వాతంత్ర్యమును స్థిరపఱచి రక్షించుట కీమహాసంగ్రామ మవసరమైనది. పందొమ్మిదవ శతాబ్దమునందు వ్యక్తిస్వాతంత్ర్య భావము వ్యాపించి, ధర్మపరిపాలనమునకు ప్రాతినిధ్యనిర్మాణములును, ప్రజాతంత్రమును సాధనము లని యంగీకృత మైనది. ఆ భావములు మానవసోదరత్వమునకు సోపానంబు లైనను జాతీయమత్సరంబును మాన్పలేకుండెను. వ్యక్తులకు మైత్రి జాతులకు వైరము పందొమ్మిదవ శతాబ్దమునందలి భావములు. జాతీయసోదరత్వమును గ్రహింపని మానవసోదరత్వము నిరుపయోగము, అసంభవము. మానవులు సోదరు లనియు దేవుని బిడ్డ లనియు బోధించుచు, నుత్తమజాతు లని నీచజాతు లని దురభిమానము పూనుట సమంజసమా, వివేకమా, ధర్మమా? పునాది లేని నిర్మాణము సాధ్యమా? జాతీయసోదరత్వము స్థాపిత మగుటకు వర్తమాన భావములు మాఱవలయును. ప్రాత భావములు పోయి క్రొత్తభావములు గలుగుటకు లయము సాధనము. జాతీయసోదరత్వభావము పుట్టి పెరిఁగి స్థిరపడుట కెన్ని మార్పులు, యుద్ధములు, ప్రళయములు గావలయునో దేవున కెఱుక. వర్తమానసంగ్రామమున భిన్నరాజ్యములకును భిన్నజాతులకును రణరంగమునందు సమావేశము గలిగినది. మహోపద్రవావస్థయందు దురభిమానప్రకర్షణమున కవకాశము లేదు, ప్రశాంతస్థితియందును లేదు, సామాన్యస్థితియందు మాత్రము గలదు. దండధరునకు ఆంగ్ల హైందవ జర్మను జపాను రాజ్యభేదములు లేవు; తెల్ల నల్ల పచ్చ జాతిభేదములు లేవు; భాగ్య దరిద్ర స్థితిభేదములు లేవు; హిందూ మహమ్మదీయ క్రైస్తవ మతభేదములు లేవు; ధర్మాధర్మభేదము మాత్రము గలదు. లోకకళ్యాణమునకును జీవాత్మపరిణామమునకును భేదభావము నశించి సోదరభావము స్థిరపడుటకు సృష్టిస్థితిలయములు సమాన సాధనములు.

జాతీయాభిమానము జర్మనులకు విశేషము. గతించిన యేఁబదేండ్లలోను జర్మనుజాత్యభిమానము స్థిరముగ స్థాపిత మైనది. జర్మను లతిసులభముగ డెన్మార్కునుండి ష్లెస్విగును ఆస్ట్రియానుండి గలీషియాను ఫ్రాన్సునుండి ఆల్సెసు లారేనులను జయించిరి. విజయమువలన దిగ్విజయాభిలాష గలిగినది. క్షాత్రధర్మము విజృంభించినది. ప్రపంచవ్యాప్తసామ్రాజ్యనిర్మాణమునకై సకల సంపదలు వినియోగింపఁబడినవి. నిర్బంధసైన్యశిక్షణము విధింపఁబడినది. బలవత్తరమైన యుద్ధనౌకాబలము నిర్మింపఁబడినది. యుద్ధోపకరణములను నిర్మించుటకై శాస్త్రజ్ఞాన ముపయోగింపఁబడినది. సంపదల వృద్ధికై పరిశ్రమలు బలపఱుపఁబడినవి. బిస్మార్కు మొదలగు మంత్రివర్యుల పరిజ్ఞానము జర్మను ప్రతిభను విస్తరింపఁజేయుటకై వినియోగపడినది. ట్రీట్ష్కె మొదలగు శాస్త్రవేత్తలు జర్మను ప్రతిభ నుగ్గడించిరి. వారి మతమునందు లోక ముత్తమపురుష పరిణామమునకై సృజింపఁబడినది. ఉత్తమపురుషులు వర్ధిలుట తదితరులు నశించుట సృష్టినిర్ణయము. జర్మనులుత్తమపురుషులు, జర్మనుజాతి యుత్తమజాతి. ఆంగ్లేయులు మాయకులు, ఫరాసులు నిర్వీర్యులు, రుష్యనులు ప్రాకృతులు. లోకము జర్మనుతత్త్వమును వ్యాపింపఁజేయుటకై పుట్టినది. జర్మను తత్త్వమును వ్యాపింపఁజేయుట జర్మనుల విధి. బర్న్‌హార్డి యుద్ధము ధర్మము లోనుత్తమధర్మ మని బోధించెను. ఆయన మతమునందు జగత్తున ధర్మము బలమూలము; బలవంతులు బలహీనులను నిర్జించుట సమంజసము; జర్మనులు లోకసామ్రాజ్యమును పొందవలయును, లేదా చెడిపోవలయును; జర్మను లనక్రపరాక్రములు, ఆంగ్ల ఫ్రెంచి రుష్యను బలములను నిర్జించుటకు సమర్థులు; అభీష్టార్థమును జర్మనులు కష్టపరంపరలకు పాలై సాధింపవలయును. మోల్ట్కె మొదలగు వ్యూహనిర్మాతలు జర్మనుల విజయమునందు విశ్వాసము గలిగియుండిరి. సైని

కులు విజయగీతంబులను పాడుచుండిరి. విద్యాలయములందు విజయోత్సాహము బోధింపఁబడుచుండెను.

జర్మను సామ్రాజ్య పరిపాలనమిట్టి యూహలను పోషించుటకు తగిన స్థితియందున్నది. జర్మను సామ్రాజ్యము సంయుక్త సామ్రాజ్యము. సంయుక్తరాజ్యములందు ప్రష్యా ప్రధానరాజ్యము. ప్రష్యారాజులు జర్మను సామ్రాజ్యమును నిర్మించి ముఖ్యాధికారమును తమ యధీనమునందుంచుకొనిన విధ మీ సంచికయందలి జర్మనుదేశ చరిత్రమునందు తెలుపఁబడినది. హోహెన్ జొల్లోరిన్ వంశస్థు లాశాపరాయణులు. ఫ్రెడరికు మహామహుఁ డాశాపరాయణుండైనను సింగితజ్ఞుఁడు; సమయానుకూలముగ సామ్రాజ్యమును పెంచి బలపఱచెను. ఇప్పటి చక్రవర్తి కట్టి సహనము లేదు; ప్రజ్ఞ లేదు; అత్యాశాదురభిమానములు గలవు.

జర్మనుల యత్యాశ కైయిజరు విలియమునందు మూర్తీభవించినది. జర్మను రాజ్యాంగ నిర్మాణమునందు చక్రవర్తి శాసకుండు, మంత్రి, కోశాధ్యక్షుఁడు, సేనాధిపతి, నౌకాదళాధ్యక్షుఁడు. పాలనము నియమితపాలన మైనను చక్రవర్తి సర్వాధికారి, సర్వస్వతంత్రుఁడు. విలియము చక్రవర్తి సర్వజ్ఞత్వాభిమాని. విలియము కవులకు కవి, గాయకులకు గాయకుఁడు, సేనాధ్యక్షులకు సేనాధ్యక్షుఁడు, మతబోధకులకు బోధకుఁడు, పండితులకు పండితుఁడు. ఇంత యేల?— సర్వజ్ఞశిఖామణి. ప్రజలు, అధికారులు, చక్రవర్తి— అందఱు తమ బలవిజయములందు సంపూర్ణ విశ్వాసము గలిగియుండ, సమయ మాసన్న మైనపుడు యుద్ధము తప్పునా? జర్మనుల మతమునందు "జర్మని దేవదేశము, జర్మనులు దేవతలు, చక్రవర్తి దేవేంద్రుఁడు. సురాసుర సమరమునందు సురలకు విజయము ధ్రువము." సమరోత్సాహము జర్మనులందు మూర్తీభవించినది. ఇతరభావము లన్నియు రాజస భావముచే నాసరింపఁబడినవి. దేశాదాయములో మూడవవంతు యుద్ధసన్నాహములకై వినియోగపడుచుండెను. ప్రజలు వ్యయభారమున క్రుంగుచుండిరి.

జర్మనీయుద్ధప్రయత్నములను చూచి ఫ్రాన్సు రుష్యా ఇంగ్లాండు మొదలగు రాజ్యము లన్నియును తదేకనిష్ఠతో యుద్ధప్రయత్నములు చేయుచుండెను. సకలరాజ్యములును తమ యాదాయమును, ప్రజాసౌఖ్యమునకుఁ గాక, యుద్ధసన్నాహములకై వినియోగించుచుండెను. సమరోత్సాహము మితిమీఱి సకలదేశములందును వ్యాపించినపు డేస్వల్పకారణమో సమరాగ్నిని ప్రజ్వరిల్లఁజేయుట సహజము. మహాసంగ్రామమునకు సర్వియా నిమిత్తమాత్రము. సంగ్రామాంకురములు చిరవర్ధితములు గాని యాకస్మికములు గావు. యూరపురాజ్యముల ప్రబలవైరము జర్మనుల దురభిమానము జర్మను చక్రవర్తి నిరంకుశాధికారము సంగ్రామమునకు మూలాంకురము లని యూరపుదేశచరిత్ర వలన విదితమగుచున్నది. భావప్రపంచమును మార్చి జాతీయసమస్యను విప్పి మానవసోదరత్వమును జాతీయసమత్వమును స్థిరముగ స్థాపించుటకై వర్తమాన సంగ్రామమును నిమిత్తమాత్రముగ నుపయోగించుట భగవత్సంకల్పమై యుండును. ధర్మసంస్థాపనార్థము సంహార మవసర మని శ్రీకృష్ణుఁడు చేసిన తత్త్వోపదేశము విశ్వసనీయము.

తే. తొల్లి నలహరిశ్చంద్రాదు లెల్ల నలఁగ
మెచ్చి సత్యస్వరూపంబు వచ్చి కాచె
దుష్టయం బగు మాయను ద్రోలఁచి యశము
గనిర లోకంబులు నుతింపఁ గరము ఘనసు!

అపక్ష్యములకై పదునారవ లూయి భార్యాపుత్రసహితముగ బలి చేయఁబడెను.

పదునారవ లూయితో ఫ్రాన్సునందు రాజుల రాజ్యము తుదముట్టినది. ప్రజల పాలన మారంభమైనది. రాజైటుల కాలము నందు ప్రజల పని పాటుపడుట, పండించుట, పన్నులను చెల్లించుట; రాజుల పని యుద్ధము చేయుట, వ్యయము చేయుట, సుఖపడుట. రాజు శాసకుఁడు, నిర్వాహకుఁడు, దండధరుఁడు; ప్రజలకు స్వాతంత్ర్యము లేదు, ప్రాతినిధ్యము లేదు, అధికారము లేదు. ఆదాయ వ్యయములను నిర్ణయించుటకును, నిరూపించుటకును, పరిశీలించుటకును ప్రజలకు స్వాతంత్ర్యము లేదు. ప్రజలు తిరుగుఁబాటు చేసిరి. రాజ్యవిప్లవ మేర్పడెను. దేశము హత్యలకును దౌర్జన్యములకును నిలయముగ నుండెను. ఆ సంధి సమయమునందు నెపోలియను రాజ్యరంగమునందు ప్రవేశించెను.

నెపోలియను శూరాగ్రేసరుఁడైన కర్మిష్ఠునివలె సూక్ష్మబుద్ధి; యుద్ధవ్యూహములను నిర్మించుటయందు అద్వితీయుఁడు. సహజమైన ప్రజ్ఞావంతుఁడు. ప్రజాతంత్రజ్ఞుఁడు; రాజనీతిజ్ఞుఁడు; అత్యాశాపరుఁడు; లోకైకంటకుఁడు. ఆ సూర్యప్రతిమానమైన తేజముతో యూరపురాజ్యముల నోడించి సకలరాజ్యములందును సంక్షోభము పుట్టించెను. ప్రజలు పాలకులు భీతావహులైరి. ఎప్పుడే రాజ్యమునందు జయపతాకమును స్థాపించునో తెలియకుండెను. ఇటలీ, స్పెయిను, జర్మని, ఆస్ట్రియా, రష్యా రాజుల నోడించి తనవారికి కొన్ని రాజ్యములందు పట్టము గట్టెను. రాజ్యాంగములందు నిరాఘాటుఁడుగ చేసి ఫ్రాన్సుదేశమునకు చక్రవర్తి కాఁజాలెను. అతనికి అడ్డులేదు. నెపోలియనునకు సంతృప్తి కలుగలేదు. తన యాధిపత్యముక్రింద యూరపు ఖండమునందు రోమకసామ్రాజ్యమువలె మహాసామ్రాజ్యమును స్థాపింప నెంచెను. ఆసియాఖండమును జయింప సమకట్టెను. ఆశాపిశాచమునకు లొంగనివా రెవరు!




యూరపురాజ్యములు మేల్కొనినవి. కర్తవ్యమును గమనించినవి. ప్రబలరాజ్యభంజననీతి నవలంబించినవి. ఇంగ్లాండు నాయకత్వము వహించెను. నెపోలియను, జర్మనులు వర్తమాన సంగ్రామమునందు వర్తించుచున్న రీతిని, ఆంగ్లవ్యాపారబహిష్కారమును ప్రకటించెను. ఆ నీతివలన పరాసుల వ్యాపారము పడిపోయినది. యూరపు రాజ్యములకు నష్టము కలిగినది. ఆంగ్లేయుల వ్యాపారమునకు భంగము కలుగలేదు. ఫ్రెంచి ప్రజలకు సయితము నెపోలియనుపట్ల నసూయ కలిగినది. నెపోలియను రాజ్యభారమును పరిత్యజించెను. ఎల్బాద్వీపమునందు నివసించుట కంగీకరించెను. లోభోపహతుఁడై తిరిగి రాజ్యభారమును పూనినప్పుడు 1815వ సంవత్సరమునందు సంయుక్తరాజ్యబలముచే వాటర్లూవద్ద నోడింపఁబడెను. ద్వీపాంతరవాసిగ చేయఁబడి సెయింటు హెలీనాయందుంచఁబడెను.

కార్సికలందు జన్మించి జగదేకవీరుఁడై చక్రవర్తియై సెయింటు హెలీనాయందు బలాత్కారప్రవాసియై సామాన్యమానవునివలె కాలధర్మము నొందిన నెపోలియను చరిత్ర ధీశక్తిసంపదల యస్థిరతను చాటుచున్నది.

తిరిగి ఫ్రాన్సునందు రాజుల పాలనము స్థాపింపఁబడినది. కాని రాజుల బలము తగ్గి ప్రజాతంత్రము స్థాపితమైనది. రాజుల పాలనము చిరకాలము నిలువలేదు. 1830-1848 సంవత్సరములందు పరివర్తనము లేర్పడి ప్రజాసత్తాక పాలనము స్థాపితమైనది. మరల 1851వ సం.నందు రాజాధికారము స్థాపితమైనది. లూయి నెపోలియను రాజ్యము చేసెను. ఆ రాజునకు నెపోలియనునకుఁ గల సామర్థ్యము లేదు కాని, ఆశ మాత్రము గలదు. ఫ్రాన్సుదేశమున కన్నిదేశములందును మానభంగము కలిగెను.

ఆసమయమునందు స్పెయిను దేశమునకు రాజు గావలసియుండెను. జర్మనులు తమ రాజకీయుని నియమింప సమకట్టిరి. పరాసులు సమ్మతింపలేదు. జర్మని యిప్పటివలె నప్పుడును యుద్ధమునకు సిద్ధముగ నుండెను. జర్మనీ ఫ్రాన్సులకు యుద్ధము పొసఁగెను. మూఁడు మాసములలో ఫ్రాన్సు సంపూర్ణముగ నోడింపఁబడెను. ఫ్రాన్సుదేశము ఆల్సేసుమండలమును, లోరయినునందు కొంత భాగమును, 320.00,00,000రూప్యములను జర్మనులకు సమర్పించి సంధిచేసికొనెను.

1870వ సం.నందు తిరిగి ప్రజాసత్తాక పాలనము స్థాపింప

నడుచు చున్న, యిప్పుడు నోవాబజా రని పిలువఁబడు, రాస్కియా జిల్లాను ప్రతిఫలముగ సంపాదించెను. 1180-వ సం. లో మాన్యుయల్ రాజు చనిపోయి కాన్‌స్టాంటినోపిలు బలహీనముగ నుండినపుడు నిమాన్జా తన రాజ్యమును వృద్ధిపఱచుకొనుటకు మంచి సమయ మను కొని నిశ్చని తన రాజ్యమునకు చేర్చుకొని (గ్రెష్టినాను తనకు ముఖ్య పట్టణముగ చేసికొనెను. ఇప్పు డితని రాజ్యము మునుపటికి రెండింత లాయెను. ఇంతటితో తృప్తి నొందక 1185-వ సం. లో గ్రీసు రాజు నకు కప్పము కట్టుటను నిరాకరించి నిమాన్జా తన స్వాతంత్ర్యమును ప్రకటించెను. ఈతని ప్రథను తగ్గించుటకై గ్రీసురాజు చేసిన యత్న ములు విఫలము లగుటచే, అతఁ డితనితో సంధి చేసికొనవలసినవాఁ డాయెను. నిమాన్జా గ్రీసుచక్రవర్తిని సమానునిగ చూచెను. అతని కుమారునకు చక్రవర్తి కూఁతు నిచ్చి వివాహము చేయుటచే సర్వి యా స్వాతంత్ర్య మంగీకరించిన ట్లాయెను. నిమాన్జా యింతటితో కూడ తృప్తి నొందక అప్పటి జర్మనుచక్రవర్తిగ నుండిన ఫ్రెడరిక్ బార్బరోజాతో స్నేహము చేయఁదలపెట్టెను. ఆయన మతయుద్ధము నిమిత్తము చేయనుండిన ప్రయాణములో తన దేశముగుండ మార్గమును ఆ సమయమున విశ్రమించుటకు మంచి పట్టణమును నొసంగెద నని రాయబారి నంపెను. సర్వియా యెక్కడ నుండినదియు తెలియని యక్కాలమున నీ వార్త వచ్చుట జర్మనీలో మిక్కిలి యద్భుతముగ నుండెను. నిమాన్జా పిలుపు ప్రకారము బార్బరోజా సర్వియాకు ముఖ్యపట్టణ మగు నిస్సేములో వచ్చి దిగెను. ఇరువురు రాజులును స్నేహభావమును వెలిపుచ్చుకొనిరి. పిమ్మట నిమాన్జా ప్రపంచవిషయ ములకు విముఖుఁడై 1195-వ సం. లో తన కుమారునకు సింహాసనము వదలి అతాస్‌పర్వతముమీఁద మఠము నొకదాని నేర్పఱచుకొని యయిదు సంవత్సరములకు పిమ్మట సిమియన్ అను పేరుతో మర ణించెను—మతగురు వాయెను.

అతని చిన్న కుమారుఁడు సావా ఆ పర్వతము మీఁదనే పవి త్రత నొంది మతగురువు వాయెను. పిమ్మట తన యన్నయగు స్టెఫెన్ యొక్క సింహాసనాధిష్ఠాన కాలమునందు తన చేతితో నతని శిరముపై కిరీటము పెట్టెను. అప్పటినుండి తూర్పు రాష్ట్రములలో సర్వియా యొక్క మతాధిక్యత హెచ్చెను. మొత్తముమీఁద స్టెఫెన్ తాను రాజ్యము చేసిన 25 సం.ల కాలములో నొక సారియైన యుద్ధమునకు దిగక శాంతిని స్థాపించి దేశమం దంతటను విద్యాలయములను దేవాల యములను నెలకొల్పెను. మొట్టమొదట నాణెములితని కాలములోనే ముద్రింపఁబడెను. బల్గేరియాతోడను గ్రీకు చక్రవర్తితోడను సఖ్యము చేసికొని సర్వియాగౌరవమును హెచ్చించెను. గ్రీసుచక్రవర్తి కాన్ స్టాంటినోపిలు సింహాసనమునకు వచ్చినపుడు, సర్వియా డాల్మటియా బాస్నియాలకును సమీపపు జిల్లాలకును స్టెఫెన్ రాజని యతఁ డొప్పు కొనెను. కాని దేశమునం దెంత శాంతి యున్నను డాల్మటియా బాస్నియాలను చేర్చుకొనుట హంగేరియా రాజగు రెండవ ఆండ్రూ యొక్క విరోధమునకు కారణ మయ్యెను. నడుమ నెన్ని యంతరాయ ములు కలిగినను, అరవ స్టెఫెన్ కాలములో సర్వియా ప్రభ హెచ్చియే యుండెను.

పదుమూడవ శతాబ్దము నడుమ తురుష్కులు ప్రబలియుండుట చే గ్రీసురాష్ట్రవ్యాపకమున కాటంకము కలిగెను. అందుచే గ్రీసు రాజు స్టెఫెనుకు స్టైమోనిస్ అను తన కూఁతు నిచ్చి వివాహము చేసి యతనిని మిత్రునిఁగ చేసికొనెను. ఇందువలన 1303-వ సం. లో సర్వియారాజు తన మామ పక్షమున తురుష్కులపైకి దండువెడలి వారిని ఓడించెను. పంద్రెం డేండ్లకు పిమ్మట తిరిగి సర్వియనులు గ్రీసులో ప్రవేశించి తురుష్కులను సముద్రము పర్యంతము లేకుండఁ జేసిరి. ఈ సందర్భమున బల్గేరియనులు సర్వియాపైకి వచ్చి యోడి పోయి సర్వియా ప్రభను మతింత హెచ్చించిరి. పిమ్మట 1330-వ సం. లో బల్గేరియాశక్తి తగ్గిపోయి యొక తరమువఱకును సర్వియా యధి కారము క్రిందికి వచ్చెను. పది పదునొకండు శతాబ్దములలో బల్గేరి యనులు సర్వియాపై కలిగియుండిన యధికారము తిరిగి యిపుడు పదుమూడవ శతాబ్దములో సర్వియాకు బల్గేరియాపైఁ గలిగెను.

సర్వియా స్టెఫెన్ డ్యూసన్ కాలమున నత్యున్నతదశయం దుండెను. డ్యూసన్ పేరు తరతరములకును పేర్కొనఁబడుచుం డెను. 1885-వ సం. లో కింగ్ మిలన్ అను సర్వియా రాజు బల్గే రియాపై దండెత్తినపుడు గూడ సర్వియా సైనికులు డ్యూసన్ డ్యూసన్ అను సంబోధనములతో బెల్గ్రేడునుండి వెడలిరి. డ్యూసన్ రాజ్యమునకు వచ్చునప్పటి కిరువది యేండ్లవాఁడే యయినను అప్పటి బల్గేరియాపై యుద్ధములో తాను స్వయముగ నొక సేనను నడిపి బల్గేరియారాజ్యమును ధ్వంసము చేసెను. బల్గేరియారాజును స్వహస్తముతో చంపెను. డ్యూసనుతో పోల్చుటకు శక్తిసామర్థ్య ములం దొక నెపోలియను మాత్రము సరియగును. సర్వియారాజ్యమునకు ఏజియన్ సముద్రములోనికి దారి యుండుట డ్యూసనుకు కవసరముగ తోఁచెను. పిమ్మట టర్కీవారికిని గ్రీసువారికిని కలిగిన కలహములో దీని నతఁడు సాధించెను. ఈ కలహములో నతనికి చాల దేశములు చేకూరుటయే గాక బల్గేరియా సయితము మితని యధికారముక్రిందికి వచ్చెను. వేయేల, యించుమించు బాల్కను రాష్ట్ర మంతయు నితని క్రిందనే యుండెను.

దేశమునందు శాంతి స్థాపించినతోడనే డ్యూసన్ చట్టములు వ్రాయుటకు మొదలుపెట్టెను; వర్తకము ప్రబలుటకై యనుకూల మయిన చట్టములను కల్పించెను. ఏవర్తకుఁ డైనను ప్రొద్దు గ్రుంకి యొక యూరు చేరినపు డతని కాహారసౌకర్యము నున్నగు వసతులు కలుగఁజేయుట గ్రామాధికారికి విధిగ చేసెను.

ఇది యిట్లుండ తురుష్కులు యూరపులో ప్రవేశించిరి. వారిని వెనుకకు త్రోలుటకై 80,000 సైనికులతో డ్యూసన్ బయలుదేఱి కాన్‌స్టాంటినోపిలు ప్రవేశించి విజయము సిద్ధముగ నుండఁగ, జ్వరము వచ్చి 1355-వ సం. డిసెంబరు 18-వ తేదిని చనిపోయెను.

ఇతనితో నితని రాజ్యము కూడ క్షీణదశకు దిగఁ

పోయెను. డూష్యను ఒక్కొక్కటిగ జయించిన దేశముల నన్నిటి నొక్కసారిగ [illegible] వారు తీసికొనిరి. తురుష్కరాజు అమురాత్ అనునతఁడు 1360వ సం. ఏడ్రియనోపిలును వశపఱచుకొని తన ముఖ్యస్థానముగ చేసికొనెను. సర్వియారాష్ట్రాధికారులు తమ రాజు యొక్క యశక్తతను చూచి తమ తమ యధికారములను మాత్రము బలపఱచుకొన మొదలుపెట్టిరి. అందఱును స్వతంత్రరాజు లైరి. డూష్యను చనిపోయిన పది సంవత్సరములలోనే యతని రాజ్య మంతయు చెల్లాచెదరయిపోయెను.

తురుష్కులు క్రమక్రమముగ సర్వియామీఁదికి వచ్చిరి. సర్వియా రాజ్యమునం దైకమత్యము లేకుండుటచే వారి నెదిరింపలేక, కొందఱు మాంటినీగ్రోకును, కొందఱు హంగేరీకిని పోయిరి. మిగిలినవారు అప్పటి కింకను తురుష్కులచే నాక్రమింపఁబడని బాస్నియాకు పోయిరి. కడపటి కసోవా యుద్ధములో జయము నొందినవారైన తురుష్కులకు కూడ చాల నష్టము సంభవించి యుండుటచే వారంతట వెంటనే యాత్రలు మాని సర్వియారాజు తమకు లొంగినవాఁడని భావించుకొని యూరకుండిరి.

పిమ్మట 1418వ సం. లో మూసా యను తురుష్కరాజు సర్వియామీఁద దండెత్తి [illegible] సర్వియనుల నోడించి మరికొంత దేశము నాక్రమించుకొనెను. 1440వ సం. లో సర్వియా యంతయు తురుష్కుల స్వాధీనమయి వారి ప్రతినిధి పరిపాలనము క్రింద నుండెను. పిమ్మట బాస్నియారాజు చనిపోవుటచే నదికూడ తురుష్క సామ్రాజ్యములో చేర్చఁబడెను. మాంటినీగ్రోలో నుండినవారును హంగేరికి పారిపోయినవారును తప్ప, తక్కిన సర్బ్యులందఱును తురుష్కులకు తలయొగ్గినవా రయిరి.

ఈ విధముగ మహోన్నతదశ నొందిన సర్వియా ధ్వంసమయి పోయెను; రాజకార్యములందే కాక మతవిషయములందుఁ గూడ కలిగిన యభిప్రాయభేదములచే, నైకమత్యము చెడి యధోగతిపాలయ్యెను. సర్బ్యులు గ్రీకుచర్చిమతస్థులు, హంగేరిలోనివారు కాతోలిక్కులు. ఉభయులకును గల మతభేదము వీరి నింతవఱకు తెచ్చెను.

### తురుష్కుల పరిపాలనము

1459వ సం. లో సర్వియా తురుష్కుల స్వాధీనమై తురుష్కుల నిరంకుశాధికారములో నుండెను. పారంపర్యముగ వచ్చుచున్న సర్బియన్ ప్రముఖుల భూములు తీసికొనఁబడి, విచ్చలవిడిగ పంచిపెట్టఁబడెను. ఏ సర్బ్యజాతిమానవుఁడును ఆయుధము ధరింపరాదు. ఎల్లప్పుడు నాయుధపాణులై యుండెడివారికి నెంతటి కష్టముగ నుండును! వివాహితులైన దంపతులు పన్నొసంగవలయును. ఇది యిట్లుండ, కొన్ని గ్రామములు స్వయముగ సుల్తాను గారి యాస్తిగ పరిగణింపఁబడెను. కూలి యేమియు నీయకయే ఆ గ్రామస్థులచే కొన్ని దినములు పని చేయించుకొను హక్కు సుల్తానున కుండెను. సర్బ్యు లీబాధల నోర్చుకొనుచు నాలుగు శతాబ్దముల కాలము తురుష్కుల యధీనములో నుండిరి. ఎన్ని దినము లుండినను స్వాతంత్ర్యము లభించు నను నాశ లేక 37,000 కుటుంబములవారు ఆస్ట్రియా దేశమునకు



ఆస్ట్రియనులును సర్వియనులును మాచ్వా యుద్ధములో పోరిన విధము

పోయి యక్కడ నివాస మేర్పఱచుకొనిరి. 1740వ సం. లో 100,000 మంది రుష్యాకు వెళ్లి కీవన్ నది ప్రాంతముల నుండిరి. వారు స్వదేశమునందుఁ గల యభిమానముచే తమ పట్టణముల పేళ్లనే తా మచటి గ్రామములకు పెట్టుకొనిరి.

బ్రాడోవిక్ అను సర్వియా మహాకవి ఆస్ట్రియా రాజగు రెండవ జోసెఫును సర్వియను ప్రజల గౌరవమును నిలిపి, సర్వియా సర్వియనులకు వచ్చునట్లు సహాయముచేయవలయు నని యనేకవిధముల స్తోత్రము చేసెను. ఆస్ట్రియా చక్రవర్తి యాయనపై నభిమానము గలిగి తురుష్కులను బాల్కనురాష్ట్రములలోనుండి తఱిమి

చేసిరి. 1869వ సం. లో నేర్పడిన పరిపాలనాపద్ధతి ప్రకారము అధికార వర్గముయు నిరనికిని 120 మంది సభ్యులు గల దేశీయమహాసభ యును నుండెను. సభ్యులలో 90 మంది ప్రజలచేతను 30 మంది రాజు చేతను నెన్నుకొనఁబడిరి. ఇంకను ప్రజల సంతుష్టిపఱచుటకై యసాధారణ సమయములలో 480 మంది ప్రజాప్రతినిధులు చేరిన మహాసభవలన చేయఁబడిన తీర్మానము, అదివఱకుండిన యే శాసనము నైనను మార్చునట్లు నిర్ణయింపఁబడెను. ఈయున్నిక సాధారణముగ మంత్రులచేతిలో నుండుటచే, 1888వ సం.పు రేడికల్ రిఫారము అక్టు, అప్పటి రాజగు అలెగ్జాండరుచే రద్దుచేయఁబడినప్పుడు అది అమలులోనికి తేఁబడి నేఁటివఱకు జరుగుచున్నది.

మిలన్ యువరాజు 1872వ సం. లో యుక్తవయసు వచ్చి రాజ్యభారమును వహించెను. రీజెంట్ల పరిపాలనలో సర్వజాతివారందఱు నొక ప్రభుత్వముక్రింద నుండవలెననెడి యభిప్రాయము ప్రజలకు బాగుగ కలిగెను. సర్వియా తిరిగి తుర్కీపై యుద్ధము ప్రకటించెను. 1,48,000 సర్వియను సైనికులు తుర్కీపైకి వెళ్లిరి. కాని సర్వులు తుర్కీసైనికులకంటె తక్కువ బాకచక్యము గలవారగుటచే తురుష్కులు సర్వులను వెనుకకు ఱఱిమి సర్వియాలో ప్రవేశించిరి. 1877వ సం. లో సర్వియా టర్కీతో సంధి చేసికొనెను. కాని మాంటనీగ్రో టర్కీతో పోట్లాడుచునే యుండెను. ఇంతలో రష్యా కూడ టర్కీపై యుద్ధము ప్రకటించెను. రొమేనియా కూడ చేరెను. అయినను సర్వియా మాత్రము కొంత కాలమునకు రెట్టముగ నూరకుండి తుదకు కలహములోనికి దిగెను. ఈతడవ సర్వియా ప్రభావము కొంచెము హెచ్చుగనే యుండెను. విశేషనష్టము గలిగినను సర్వియను సేనలో నొక భాగమునకు పైరట్ వద్ద మంచి జయము కలిగెను. రెండవ భాగము సర్వియా రాజగు మిలన్ చే నడుపఁబడి యప్పటికి 500 సం. నుండి యేకదీక్షగ తురుష్కుల చేతిలో నుండిన నిశ్చయను పురాతనపు సర్వియను పట్టణమును పట్టుకొనెను.

తొమ్మిది దినములకు పిమ్మట ప్రాంతాయొద్ద కలిగిన మూడవ జయము సర్వియను ప్రజల కెంతేయు నుత్సాహము కలిగించినది. సాన్ స్టెఫానోయొద్ద జరిగిన సంధి కనుబంధముగ 1878వ సం. లో జరిగిన బర్లిన్ సంధివలన సర్వియా పిరాటు జిల్లాను ప్రాంతాను నిశ్చని చేర్చుకొనఁగలిగెను. సర్వియా రాజ్యము మునుపటికంటె నొకపాలధిక మాయెను. ఇదివఱకు సాన్ స్టెఫానోయొద్ద తుర్కీచే నంగీకరింపఁబడిన సర్వియా స్వాతంత్ర్య మిప్పుడు యూరోపియన్ రాజులచేఁ గూడ నొప్పుకొనఁబడెను. 1882వ సం. లో యువరాజు ఒకటవ మిలన్ అను పేరున సింహాసనము నెక్కెను. సర్వియా కూడ స్వతంత్రరాజ్య మయ్యెను.

అభినవసర్వియా

శాశ్వత మైన శాంతిని నెలకొల్పుటకై యేర్పడిన బర్లిన్ సంధి సర్వియాకును బల్గేరియాకును అసంతుష్టిగనే యుండెను. ఒకరపేక్షించిన దేశమునకు మరియొకరాశపడఁజొచ్చిరి. ఈ రెండు దేశములకును సరిహద్దుగ నున్న టిమక్ నదికి బల్గేరియావైపున కొంత బీదిరాకుభూమి యుండెను. దాని మాట యేమియు బర్లిన్ సంధిలో నెత్తుకొనఁబడలేదు. సర్వియనులు నదిని దాఁటి వచ్చి దానిని సేద్యము చేయ మొదలిడిరి. 1884వ సం. లో బల్గేరియా పటాలము వీరిని తఱిమివేసెను. ఆ భూమికి బల్గేరియనులు విశేషముగ పన్ను విధించిరి.

ఇది సర్వియనులకు కష్టముగ నుండి వారు యుద్ధమునకు దిగిరి. ఈతడవ కూడ బల్గేరియనులచే తెఱుమఁబడిరి. కాని యీదేశము బల్గేరియావా రాక్రమించుకొనుట యాస్ట్రియావారి కిష్టము లేక, వారడ్డపడి సర్వియాను రక్షించిరి; సర్వియాకు దేశనష్టము గాని యుద్ధపు కర్చుల నష్టము గాని లేకుండునట్లు చేసిరి. ఈ యపజయము ప్రజల యసంతుష్టికి కారణమై దేశములో కక్షలేర్పడినవి. అంతఃకలహములు ప్రబలినవి. గృహకల్లోలము కూడ దీనికి తోడై, మిలన్ వైరాగ్యముతో 1889వ సం. న రాజ్యమును తన కుమారుఁడగు అలెగ్జాండరున కిచ్చి యుగ్గురు సహాయకుల నేర్పఱచెను. ఇతఁడు కడు సమర్థుఁడు. ఇతని కాలములో యాస్ట్రియన్ ప్రభుత్వమునందుఁబోలె సర్వియను లందఱు నేకచ్ఛత్రము క్రింద నుండు రని యభిప్రాయముండెను.

మాటిమాటిక్రిందను జరిగిన బాల్కను యుద్ధమునందు సర్వియాకు కొంతభూమి తురుష్కసామ్రాజ్యములోనిది సంక్రమించెను. సర్వియనుల నిర్బంధనము నణచుటకై ఆస్ట్రియా నిరంతరము ప్రయత్నములను చేయుచుండెను. బాల్కనుయుద్ధమునందు సర్వియాకు సంపూర్ణవిజయము కలిగినను ఆస్ట్రియా కుట్రలవలన దిగిన ప్రతిఫలము దక్కకుండెను. మీదు మిక్కిలి బోస్నియా హెర్జగోవినియాలను ఆస్ట్రియా తన రాజ్యమునందు చేర్చెను. ఆస్ట్రియా బలవంతమైన రాజ్యము. సర్వియా స్వల్పరాజ్యము. ఆస్ట్రియా సర్వియా వ్యాపకమున కన్ని దిశలందును వాటంకములను గల్పించుచు స్లావుజాతియొక్క వైరమును బలపఱచెను. సర్వియనులు స్వాతంత్ర్యప్రియులు, శూరులు, దేశాభిమానులు. సర్వియనులను వర్తమాన సంగ్రామమునకు వారిగాఢమైన దేశభక్తి పురికొల్పినది. దేశవిస్తీర్ణము 34,000 చదరపుమైళ్లు, జనసంఖ్య 50,00,000, ఆదాయము సవరనులు 48,03,262, వ్యయము సవరనులు 52,80,588, సైన్యబలము 250,000. పాలనము నియమిత పాలనము.

ఉ. ఎవ్వఁ డనంతలోకము సృజించుచు బెంచుచుఁ సంహరించునో
ఆ విభుఁ డీశ్వరుం డగు జనార్దన దేవుఁడు జార్జిరిన్ సదా
ఇ వ్వసు ధాతలంబునను హిందుజనాళికి సార్వభౌముఁగా
దివ్య నరాతివర్గజయశీలునిఁగా దయఁ బ్రోచుఁగాపుత్రిన్.

SIR EDWARD GREY



సర్ ఎడ్వర్డుగ్రే: విదేశాంగమంత్రి

MR. BONAR LAW



బోనర్ లా : అధినివేశాంగమంత్రి

MR. WINSTON CHURCHILL



విన్‌స్టన్ చర్చిలు: లంకాష్టరు ప్రదేశమంత్రి

G

FIELD MARSHAL EARL ROBERTS



కీర్తిశేషులయిన రాబర్ట్సుప్రభువు

PRINCE MAURICE OF BATTENBURG



బాటెన్ బర్గు రాకొమరుడు మారిస్ (యుద్ధములో మృతినొందెను)

MAJOR GENERAL PULTENY



మేజరు జనరలు పుల్టెని



యుద్ధకార్యాలయమునందు కిచెనరుప్రభువు రాబర్ట్సుప్రభువుతో సంప్రతించుట.

ఆయన యుద్ధారంభమునందు యుద్ధమంత్రిగ నియమింపఁబడినపుడు "నేను యోధుఁడను, నాకు రాజ్యతంత్రములతో ప్రమేయము లేదు." అని నుడివెను. కిచినెరు ప్రభువు సామర్థ్యమునందు సైనిక నివహంబులు, ప్రజలు, మంత్రులు సంపూర్ణ విశ్వాసము గలిగియున్నారు.



యుద్ధారంభమునందు మాన్సు సమీపమున జర్మను సైనికులకును బ్రిటీషు రౌతులకును బాహాబాహీ యుద్ధము జరిగినది. జర్మనులు మైలుదూరమునందున్న ఫిరంగులతో బ్రిటీషుసైన్యమును సంహారము చేయుచుండిరి. బ్రిటీషు సేనానాయకుడు జర్మనుల ఫిరంగులను వశపరచుకొనవలెనని సైనికులకుత్తరువుచేసెను. తొమ్మిదవ లేన్సరుల పటాలము, గుండ్లవాన కురియుచున్నను, పోయి ఫిరంగులను గాల్చువారిని జంపి ఫిరంగులను పాడుచేసి మరల వచ్చిరి; తిరిగి వచ్చునపుడును గుండ్లవానను జర్మనులు కురిపించిరి. ఆ యోధాగ్రేసరుల శౌర్యమును గొనియాడుచు విలియం వాట్సనుకవి గీతములను విరచించెను. ఈ పటము ఆ రంగమును దెలుపుచున్నది.

యుండును. ముందున్న మీటపలకలును, వెనుక నున్న చుక్కాని పలకలును విమానమున కంతకు నాధారముగా నున్నవి. ఈ మర లన్నియు వైమానికుని స్వాధీనములో నుండును.

### మానోప్లేను

మానోప్లేను నిర్మాణమునకును, బైప్లేను నిర్మాణమునకును వ్యత్యాస మధికము. బైప్లేను క్రిందిపలకయొక్క వెనుకభాగము నిలువుచుక్కాని నుంచుటకు మాత్రమే యాధారముగా నుండును. మానోప్లేను క్రిందిపలకయొక్క వెనుకభాగమును ఫ్యూజిలేజి యందురు. అనఁగా పిట్టయొక్క పొట్ట యేవిధముగా దానితలకు, రెక్కలకు, తోఁకకు నాధారమో అటులే మానోప్లేనుయొక్క వెనుకభాగము విమానమున కంతకు నాధారమై యుండును. మానోప్లేనుయొక్క ఫ్యూసిలేజి (పొట్టము) పిట్టయొక్క యాకారమును బోలి యుండును. ఇది పూర్తిగా మూయఁబడియుండును. ఇది నిర్మాణ మందు వంపుగా నుంచుటచేగాలి సుడిగాఁ దిరుగుటకు వీ లుండదు. దీనియొక్క స్వరూపము చేఁపవలె ముందుభాగము లావుగా నుండి వెనుకకు పోనపోను సన్నమై కూచిగా నుండును.

పిట్టయొక్క శిరస్సు దాని శరీరముయొక్క ముందుభాగము నం దుండినట్లు మానోప్లేను విమానముయొక్క ముందుభాగమునందు ప్రోపెల్లరుయంత్ర ముండును. ఈ ప్రోపెల్లరు వెనుకనె యింజను నుండును. దీని యిరుసునకు ముం దున్నప్రోపెల్లరు సంధింపఁబడి యుండును. ఇంజనువెనుక వైమానికునిసీట నుండును. బైప్లేను కున్నట్లు దీనికిని వెనుకభాగమున తోఁకవలె నొకపలక యుండును. దీనినె టెయిల్ ప్లేను అని పిలుతురు. ఇది యంత్ర మంతకు నాధారభూతమై యుండును.

మానోప్లేను యొక్క రెక్కలు క్రిందికి మీఁదికి వాడించుట చేతనె విమానము ఆకసమున నిలువఁగలుగుచున్నది. ఈ కదలిక వైమానికునియొద్ద నున్న తీఁగెలద్వారా గలుగు చుండును. మానోప్లేను యొక్క రెక్కలును బైప్లేనుయొక్క పలకలును పొడవగు తేలిక యైన కఱ్ఱలతో గదులుగదులుగ నొక చట్టముగ నిర్మింపఁబడి వానిపై నారగుడ్డ బిగువుగ బంధింపఁబడియుండును.

### పైకి క్రిందికి పోవువిధము

విమానము ప్రథమమున ముందుకు జరుపఁబడి ఎలివేటరు (మీట) సాహాయ్యమున క్రిందికి దిగుచుండును. ఇట్టి యెలివేటరు బైప్లేనులో ముందుభాగమున నుండును. మానోప్లేనులో వెనుక నుండును. బైప్లేనులో నెలివేటరుయొక్క లోపలికొన లుంటకలలో నుంచఁబడును. వెలుపలి కొనలు పైకి క్రిందికి లేపుటకు వీలగును. మానోప్లేనులో మధ్యభాగమునందు బందులతో సంధింపఁబడిన తీఁగలవల్ల క్రిందికి మీఁదికి లేపఁబడును.

### కుడి యెడమలకు నడచువిధము

నిలువుచుక్కానివల్ల విమానము కుడియెడమలకు త్రిప్పఁబడును. ఈ చుక్కాని యన్నిరకముల విమానములలోను వెనుకభాగమునందే యుండును. కొన్ని విమానములలో నొక్క చుక్కానియు మరికొన్నిటికి రెండు చుక్కానులును నుండును. ఈ రెండు చుక్కానులు నొకదానిప్రక్క నొకటిగాఁ గాని, యొకదానిపై నొకటిగాఁ గాని యుండును. నిలువుచుక్కాని కుడిప్రక్కకు త్రిప్పిన విమానము కుడిప్రక్కకు తిరుగును. ఎడమప్రక్కకు త్రిప్పిన ఎడమ ప్రక్కకు తిరుగును. ఈ నిలువుచుక్కానికి తగిలెడి గాలి తాకుడువలన విమానముయొక్క ముందుభాగము (ముఖము) దిక్కులకు తిరుగుచుండును.

### సంచరించు విధము

బైప్లేను గాని మానోప్లేను గాని యొకటి రెండు ప్రోపెల్లరుల వల్ల నడుపఁబడును. ఇది విమానముయొక్క ముందు భాగమున నుండును. ఈ ప్రోపెల్లరులకు విద్యుచ్ఛక్తి విసనకఱ్ఱల కుండెడి యాకులవలె రెండు గాని మూఁడు గాని యాకు లుండును. ఈ యాకులు నిమిషమునకు వేయిసార్లు వంతున ఇంజను సాహాయ్యమున తిరుగుచుండును. ఇట్లు తిరుగుటచేతనే విమానమునకు ముందుకు జరుగు శక్తి కలుగుచున్నది. మఱమేకు తలయొద్ద నలితో త్రిప్పుటవలన మేఁ కేవిధముగా కొయ్యలోనికి చొచ్చుకొనిపోవునో యా రీతిగా ప్రోపెల్లరు యంత్రపు సాహాయ్యమున విమానము గాలిలో మార్గము చేసికొని ముందునకు నెట్టుకొనిపోవును.

### నీటిమీఁద నడుచు విమానములు

కొన్ని విమానములు నీటిమీఁద దిగినప్పుడు మునిగిపోకుండ విమానములయొక్క యడుగుభాగము దోప్పవలె వంపుగా చేయఁబడి యుండును. ఈ వంపువలన అంగుళముల కెరటము వచ్చినను నపాయ ముండదు. పెద్ద పెద్ద యల లున్నప్పుడు గాని తుపాను గొట్టుచున్నప్పుడు గాని విమానము నీటిమీఁద దిగఁజాలదు. విమానముయొక్క భారమునకుఁ దగినట్లు క్రిందిభాగము వంపుచేయఁబడును. ఇట్టి విమానములు యుద్ధ సమయములలో శత్రువులయొక్క గుట్టుమట్టులను కనుఁగొనుటకు ప్రతి యుద్ధనౌకమీఁదను నుండును.

విమానములనుగూర్చి శాస్త్రజ్ఞులు శోధనలు చేసి దినదినాభివృద్ధి గాంచుచున్నారు. అందువల్ల నీ విషయమై యింతటితో ముగించుటకు వీలుండదు. ప్రథమమున గుమ్మటములు కనిపెట్టఁబడెను. తరువాత బుద్ధివికాసము పెంపొందినకొలఁది శోధనలు చేసినకొలఁది నీగుమ్మటములలో నెన్నియో మార్పులు చేయఁబడి గాలిమోడలు విమానములు, నీటిమీఁద దిగు విమానములు, యుద్ధమున కుపయోగపడు విమానములు మొదలగునవి కనిపెట్టఁబడెను. ఒక్కమనుష్యుని కన్న నెక్కువమందిని తీసికొనిపోవుటకు వీలులేని విమానము లిప్పుడు పలువు రెక్కిపోవుటకు తగినట్లు చేయఁబడెను. అంతియెగాక వేల కొలఁది టానుల బరువు గల ఫిరంగులను, సామగ్రులను తీసికొనిపోఁ గల శక్తియు గలిగింపఁబడెను. ఇంక నెన్ని యాశ్చర్యకరములైన క్రొత్త యేర్పాట్లు గావింపఁబడనున్నవో యోచించుట దుస్తరము. సర్వేశ్వరునిచే సృజియింపఁబడిన మనుష్య మాత్రుఁడే ఇట్టి మహాద్భుత కార్యములను చేయుచుండ, నిక సృష్టికర్తయైన యా పరాత్పరుని మహిమలు అగమ్యగోచరము లయి వర్ణనాతీతములుగ నుండును గదా!

యుండును. ముందున్న మీటపలకలును, వెనుక నున్న చుక్కాని పలకలును విమానమున కంతకు నాధారముగా నున్నవి. ఈ పర లన్నియు వైమానికుని స్వాధీనములో నుండును.

### మానోప్లేను

మానోప్లేను నిర్మాణమునకును, బైప్లేను నిర్మాణమునకును వ్యత్యాస మధికము. బైప్లేను క్రిందిపలకయొక్క వెనుకభాగము నిలువుచుక్కాని నుంచుటకు మాత్రమే యాధారముగా నుండును. మానోప్లేను క్రిందిపలకయొక్క వెనుకభాగమును ఫ్యూజిలేజి యందురు. అనగా పిట్టయొక్క పొట్ట యేవిధముగా దానితలకు, రెక్కలకు, తోకకు నాధారమో అటులే మానోప్లేనుయొక్క వెనుకభాగము విమానమున కంతకు నాధారమై యుండును. మానోప్లేనుయొక్క ఫ్యూజిలేజి (పట్టము) పిట్టయొక్క యాకారమును బోలి యుండును. ఇది పూర్తిగా మూయఁబడియుండును. ఇది నిర్మాణమందు వంపుగా నుంచుటచే గాలి సుడిగా తిరుగుటకు వీలుండదు. దీనియొక్క స్వరూపము చేపవలె ముందుభాగము లావుగా నుండి వెనుకకు పోనుపోను సన్నమై కూచిగా నుండును.

పిట్టయొక్క శిరస్సు దాని శరీరముయొక్క ముందుభాగమునం దుండునట్లు మానోప్లేను విమానముయొక్క ముందుభాగమునందు ప్రోపెల్లరుయంత్ర ముండును. ఈ ప్రోపెల్లరు వెనుకనె యింజను నుండును. దీని యిరుసునకు ముందున్న ప్రోపెల్లరు సంధింపఁబడి యుండును. ఇంజనువెనుక వైమానికునిపీఠ ముండును. బైప్లేనుకున్నట్లు దీనికిని వెనుకభాగమున తోకవలె నొకపలక యుండును. దీనిని టెయిల్ ప్లేను అని పిలుతురు. ఇది యంత్ర మంతకు నాధారభూతమై యుండును.

మానోప్లేనుయొక్క రెక్కలు క్రిందికి మీఁదికి వాడించుట చేతనె విమానము ఆకసమున నిలువఁగలుగుచున్నది. ఈ కదలిక వైమానికునియొద్ద నున్న తీఁగెలద్వారా గలుగుచుండును. మానోప్లేనుయొక్క రెక్కలును బైప్లేనుయొక్క పలకలును పొడవగు తేలిక యైన కఱ్ఱలతో గదులుగదులుగ నొక చట్టముగ నిర్మింపఁబడి వానిపై నారగుడ్డ బిగువుగ బంధింపఁబడియుండును.

### పైకి క్రిందికి పోవువిధము

విమానము ప్రథమమున ముందుకు జరుపఁబడి ఎలివేటరు (మీట) సాహాయ్యమున క్రిందికి దిగుచుండును. ఇట్టి యెలివేటరు బైప్లేనులలో ముందుభాగమున నుండును. మానోప్లేనులో వెనుక నుండును. బైప్లేనులో నెలివేటరుయొక్క లోపలికొన లుపరికలలో నుంచఁబడును. వెలుపలి కొనలు పైకి క్రిందికి లేపుటకు వీలగును. మానోప్లేనులో మధ్యభాగమునందు బందులతో సంధింపఁబడిన తీఁగెలవల్ల క్రిందికి మీఁదికి లేపఁబడును.

### కుడి యెడమలకు నడచువిధము

నిలువుచుక్కానివల్ల విమానము కుడియెడమలకు త్రిప్పఁబడును. ఈ చుక్కాని యన్నిరకముల విమానములలోను వెనుక భాగముననే యుండును. కొన్ని విమానములలో నొక్క చుక్కానియు మరికొన్నిటికి రెండు చుక్కానులును నుండును. ఈ రెండు చుక్కానులు నొకదానిప్రక్క నొకటిగాఁ గాని, యొకదానిపై నొకటిగాఁ గాని యుండును. నిలువుచుక్కాని కుడిప్రక్కకు త్రిప్పిన విమానము కుడిప్రక్కకు తిరుగును. ఎడమప్రక్కకు త్రిప్పిన ఎడమ ప్రక్కకు తిరుగును. ఈ నిలువుచుక్కానికి తగిలెడి గాలి తాకుడువలన విమానముయొక్క ముందుభాగము (ముఖము) దిక్కులకు తిరుగుచుండును.

### సంచరించు విధము

బైప్లేను గాని మానోప్లేను గాని యొకటి రెండు ప్రోపెల్లరుల వల్ల నడుపఁబడును. ఇది విమానముయొక్క ముందు భాగమున నుండును. ఈ ప్రోపెల్లరులకు విద్యుచ్ఛక్తి విసనకఱ్ఱల కుండెడి యాకులవలె రెండు గాని మూఁడు గాని యాకు లుండును. ఈ యాకులు నిమిషమునకు వేయి సార్లు వంతున ఇంజను సాహాయ్యమున తిరుగుచుండును. ఇట్లు తిరుగుటచేతనే విమానమునకు ముందుకు జరుగు శక్తి కలుగుచున్నది. మనమేకు తలయొద్ద మరతో త్రిప్పుటవలన మేఁ కేవిధముగా కొయ్యలోనికి చొచ్చుకొనిపోవునో యారీతిగా ప్రోపెల్లరు యంత్రపు సాహాయ్యమున విమానము గాలిలో మార్గము చేసికొని ముందునకు నెట్టుకొనిపోవును.

### నీటిమీఁద నడుచు విమానములు

కొన్ని విమానములు నీటిమీఁద దిగినప్పుడు మునిగిపోకుండ విమానములయొక్క యడుగుభాగము డొప్పవలె వంపుగా చేయఁబడి యుండును. ఈ వంపువలన అంగుళముల కెరటము వచ్చినను నపాయ ముండదు. పెద్ద పెద్ద యల లున్నప్పుడు గాని తుఫాను కొట్టుచున్నప్పుడు గాని విమానము నీటిమీఁద దిగఁజాలదు. విమానముయొక్క భారమునకుఁ దగినట్లు క్రిందిభాగము వంపుచేయఁబడును. ఇట్టి విమానములు యుద్ధసమయములలో శత్రువులయొక్క గుట్టుమట్టులను కనుగొనుటకు ప్రతి యుద్ధనౌకమీఁదను నుండును.

విమానములనుగూర్చి శాస్త్రజ్ఞులు శోధనలు చేసి దినదినాభివృద్ధి గాంచుచున్నారు. అందువల్ల నీ విషయమై యింతటితో ముగించుటకు వీలుండదు. ప్రథమమున గుమ్మటములు కనిపెట్టఁబడెను. తరువాత బుద్ధివికాసము నొందినకొలఁది శోధనలు చేసినకొలఁది నీగుమ్మటములలో నెన్నియో మార్పులు చేయఁబడి గాలిబోడలు విమానములు, నీటిమీఁద దిగు విమానములు, యుద్ధమున నుపయోగపడు విమానములు మొదలగునవి కనిపెట్టఁబడెను. ఒక్కమనుష్యుని కన్న నెక్కువమందిని తీసికొనిపోవుటకు వీలులేని విమానము లిప్పుడు పలువు రెక్కిపోవుటకు తగినట్లు చేయఁబడెను. అంతియెగాక వేలకొలఁది టనుల బరువు గల ఫిరంగులను, సామగ్రులను తీసికొనిపోఁగల శక్తియు గలిగింపఁబడెను. ఇంక నెన్ని యాశ్చర్యకరములైన క్రొత్త యేర్పాట్లు గావింపఁబడనున్నవో యూహించుట దుస్తరము. సర్వేశ్వరునిచే సృజియింపఁబడిన మనుష్య మాత్రుఁడే ఇట్టి మహాద్భుత కార్యములను చేయుచుండ, నిఁక సృష్టికర్తయైన యా పరాత్పరుని మహిమలు అగమ్యగోచరము లయి వర్ణనాతీతములుగ నుండును గదా!



గాలిగుమ్మటములు



ఫ్రెంచి ఆకాశయానములు




ఆంగ్ల ఆకాశయానములు



జర్మను కెప్లినులు

ఆకాశయానముల వ్యాసమునందు విమానములకు గాలిఓడలకుగల భేదము తెలుపబడినది. ఫ్రాన్సు ఇంగ్లాండు రష్యా మొదలగు దేశములందు సయితము కెప్లినువంటి గాలిఓడలు నిర్మింపబడుచున్నవి.



యుద్ధసమయములందు పెంపుడు పావురంబులను వార్తల నంపుటకును శత్రువుల గుట్టును కనుఁగొనుటకును బంపువాడుక గలదు. పావురములను వెంటను తీసికొనిపోయి మూఁడు నాలుగు వందల మైళ్ల దూరమున వానిమెడలో చీట్లను కట్టి వదలిన నవి స్వస్థలమును జేరును. ఆయుత్తరమును జదువుటవలన స్వపక్షపు స్థితి తెలియును. శత్రువులగుట్టును గనుఁగొనుటకై పావురంబులమెడయందు ఫోటోగ్రాఫులను తీయుపెట్టెలను గట్టుదురు. అవి మిక్కిలి చిన్నవిగనుండును. వానికి స్వతస్సిద్ధముగ బొమ్మలను దీయు మర లమర్పబడియుండును. పిట్ట యెగురునప్పుడు రెండుమూఁడునిమిషములకొకసారి ఫోటో పడును. ఆ ఫిలుమునుండి ఫోటోలను తయారు చేయుటకై నం 4. సాధనము చేయబడినది. ఇట్టి సాధనములను జర్మను వేగులవాండ్రు పరదేశములలోని రహస్యములను గనుఁగొనుటకు వాడుచుండిరని ప్రతీతిగలదు. కోటలమీఁద నెగిరెడిపావురము లిపుడు కాల్చి చంపఁబడుచున్నవి. నం 2. కామెరాలో క్రింది వస్తువులు మాత్రము ప్రతిబింబించును. పావురముమెడయందున్న కామెరాలో క్రింద నెదుట నున్న వస్తువులు ప్రతిబింబించి బొమ్మ లేర్పడును.

THE FAMOUS FRENCH 75 MILLIMETRE GUN




ఫ్రెంచివారి సుప్రసిద్ధమైన 75 మిల్లిమీటరుల ఫిరంగిలో గుండ్లనువారు పేల్చుచుండుట

A GERMAN GUN DESTROYED BY 75 MILLIMETRE




ఏస్నె యుద్ధములో యూ[illegible] జర్మనుల ఫిరంగిని, అశ్వములను, సైనికులను ధ్వంసము చేయుట

ఈ 75 మిల్లిమీటరు ఫిరంగిని ఫ్రెంచి క్విక్‌ఫైరర్ అని పిలిచెదరు. దీనికంటె త్వరితముగా గుండ్లను పేల్చు ఫిరంగి యూరపులో మరియొకటిలేదు. గుండువిడువబడగానే ఇతరఫిరంగులవలె యిది వెనుకకు ముందుకు కదలదు. ఇతరఫిరంగులలోవలె ప్రతి మారు లేక నాలుగుగుండ్లనుకాల్చినతరువాత దానిని సవరింపవలసినదిలేక ఒక్కపర్యాయము నేకమును గూర్చి యుంచవచ్చును. ఈగుండ్లు చాలపెద్దవి ఒక్కటియు బరువుండును. 5 అంగుళములకు తక్కువగాకుండ పొడవుండును. 8 మైళ్ళదూరము పోగలవు.

THE 42 C. M. KRUPP HOWITZER



42 సెంటిమీటర్ క్రుప్ హావిట్జర్ ఫిరంగిని రైలుమీద పెట్టిపంపుట



IN ACTION

ఫిరంగిని ప్రయోగించుట



A SHELL FROM 42 C. M.

ఫిరంగినుండి ప్రయోగింపబడిన గుండ్లు

జర్మను 42 సెంటిమీటరు ఫిరంగినుండి ప్రయోగింపబడిన యీ రాక్షసిగుండు (సాధారణముగా ఒక మనిషియెత్తు) 5 అడుగులున్నది. 7½ మైళ్ల దూరమునుండి వచ్చి వర్డన్ కోటవద్ద పడినది. కాని బ్రద్దలుకాలేదు. దీని బరవు ఒక్కటన్నుకు 133 రతులు తక్కువగా నున్నది. ఇది ఫ్రెంచివారి వశమునం దిప్పుడున్నది.

చెప్పిరి. కావలసినంతవఱకు దోచుకొని ఆగ్రామము ఈనవనాగరకులు వదలిపోయిరి. ప్రజలును వీరి బాధలను పడఁజాలక కొద్దిపాటి జర్మను గుఱ్ఱపు దళముగాని సైనికులు గాని చేతిలో చిక్కినప్పుడు బెల్జియనులును వారిని కఠినరీతిని పరాభవించు చుండిరి.

## డినాంటు, లీజు, లోవేన్ యుద్ధము

లీజుపట్టణము పడినను కోటలన్నియు వశము కానందున జనరలు ఎమ్మిక్ గారు పురబహిర్భాగమున నివసించుచుండిరి. 14-వ ఆగష్టు తేదిన ఫ్రెంచిసైన్యములు బెల్జియనుల సహాయార్థము వచ్చుచున్నవనియు, వారివారి యుద్యోగులు యుద్ధక్రమమును గురించి పరిష్కరించుకొనిరనియు తెలిసినది. 13 ఆర్మీకోరులు (కోరు అనగా 40,000 సైనికులు) ఫ్రాంసును వదలి బెల్జియము రక్షణార్థమై వచ్చుచున్నారనియు వదంతులు పుట్టెను.

## డినాంటు యుద్ధము

బెల్జియములోని ఈ డినాంటుకును ఫ్రెంచివారి సరిహద్దు గ్రామమగు గివెట్‌కును దూరము 14 మయిళ్లు మాత్రమే. ఇది మ్యూజానది కుత్తరమున నున్నది. ఇచ్చటికి కొంత ఫ్రెంచిసేన పంపఁబడెను. ఇంతకుముం దిచ్చటనున్న బెల్జియముసేనకు సరియైన తుపాకులుగాని ఫిరంగులుగాని లేవు. జర్మనులు 15-వ ఆగష్టు తేదిన మ్యూజానదికి క్రిందిభాగమున దాటి నామూరుమీదికి వెళ్లఁగలమని ప్రయత్నించు చుండిరి. ఫ్రెంచివా రాకస్మికముగా నెదుర్పాటు తాకఁబడినను సైన్యముతో పోరాడిరి. ఒక ఫ్రెంచిసేన అరగంటలో నాలుగు మయిళ్లు పరుగెత్తుకొని వచ్చెను. ఫ్రెంచివారు జర్మనుల పతాకమును గురిపెట్టి కాల్చి పటాపంచలు చేసిరి. ఇచ్చట ఫ్రెంచివారికి తాళఁజాలక డినాంటు లోకమయిలు పయిగా నదిని దాఁటుటకయి జర్మనులు వెళ్లుచుండిరి. ఇచ్చట తాత్కాలిక వారధి కట్టి దాటుచున్న జర్మనులు ఫ్రెంచివారి ఫిరంగులకు సరియయినగురి యయిరి. వంతెన ముక్కలుముక్కలుగా చేయఁబడెను. అనేకులు శత్రువులు జలమరణమును పొందిరి. కాని మధ్యాహ్నము రెండుగంటలకు జర్మనులు డినాంటుపట్టణమునే ముట్టడించిరి. వారిని అపుట కెదరించిన శక్తి లేకపోయెను. ఇచ్చట ఫ్రెంచివారి అరపటాలము యోడింపఁబడెను. దుర్గముపయిని జర్మనులు తమ పతాకమును పాతిరి. దుర్గమునుండి మెషీను గన్నులను ప్రయోగించి నిరపరాధులగు పురజనుల ననేకులను చంపిరి. ఇంతలో ఫ్రెంచివారికి కావలసిన సేన మోటారు బండ్లలో రాఁగా సాయంకాల మయిదుగంట లగునప్పటికి నది కిరుపార్శ్వములను నతి తీవ్రముగా జర్మనులకును, ఫ్రెంచివారికిని పోరు జరుగుచుండెను. దుర్గముమీఁది జర్మనుపతాకమును రెండుపర్యాయములు గురిపెట్టి కొట్టి ఫ్రెంచివారు ఆకసములో నెగురునట్లు చేసిరి. ఫ్రెంచి 75-వ నెంబరు ఫిరంగులు శత్రువులను భస్మముచేయుచుండెను. జర్మనువారి 7-వ కోరు (40,000 సైన్యము) రెండుగా చీల్చఁబడి ఒకటి గివెటుప్రక్కకును రెండవది అన్నిప్రక్కకును పరుగెత్తెను. సాయంకాలము 7 గంటలకు డినాంటులో శత్రువులు లేరు. బోవెన్సు సీనే గ్రామములకు మధ్యనున్న నదీతీరమునందు జర్మనుపీనుగులు 3000 లెక్కింపఁబడినవి. సుప్రసిద్ధమైన కెయిజరుగారి ఇంపీరియలుగార్డు ఈయుద్ధములో నామమాత్రావశిష్ట మయ్యెను.

## లీజుకోటలు పడకుండుట

ఈకోటలు జర్మనుల వశము కానందున జనరలు వాన్ ఎమ్మిక్ ఆత్మహత్య చేసికొనెనని వదంతులు పుట్టెను. లీజునకు కొంతదూరమందుండి 41,000 జనసంఖ్యగల సెరెంగునద్ద కఠినయుద్ధము జరిగెను. జర్మనులు రూడూసెపర్టు స్థలమునుండి తరుమఁబడిరి. ఇచ్చటనే 71-వ జర్మను కాల్బలమునకు సేనాధిపతియగు ప్రిన్సు విలియం ఆఫ్ లిప్పి గారును, ఆయన పదునాలుగువత్సరముల తనయుఁడును కీర్తిశేషులయిరి. లీజు సేనాధిపతియగు లీమెన్ గారికి ఒక షెల్లువలన గాయము తగిలినను పడకకుర్చిలో కూర్చుండి యుద్ధవిధానమును నడుపుచుండెను. ఈ పట్టణమున కంతకును ఫ్రెంచి ప్రెసిడెంటుగారగు పోయిన్‌కేరుగా రింత ధైర్యోత్సాహములతో పోరినందునకయి క్రాస్ ఆఫ్ ది లీజియన్ ఆఫ్ ఆనర్ అను గౌరవమును నొసంగి సన్మానించిరి.

## యుద్ధస్థితి

డినాంటు యుద్ధమునాఁటికి బెల్జియములో స్థితి యీవిధముగా నుండెను:—లీజ్ కోటలుకొన్ని శత్రువుల వశ మింకను కాలేదు. నామూరుమీఁద జర్మనులు వెడలలేదు. మ్యూజానదీప్రాంతమున ఫ్రెంచివారిప్పుడే చూపిన సాహసమును బట్టి గొప్పగా సహాయము లగుదురను నమ్మకము కలిగినది. ఆంట్వెర్పు అభేద్యమయిన దుర్గముగా బరిగ్రహింపఁబడుచుండెను. ఒకవేళ జర్మనులు ఈ కోటను సమీపించినను కాలువలను తెరచి నీళ్లలో ముంచివేయవచ్చునను ధైర్యము బెల్జియనుల కుండెను. బ్రసెల్సు ముఖ్యపట్టణము కోటలను గలదికాకపోయినను, దానికిని శత్రుసేనకును మధ్య, బెల్జియము సేనలో నతి పరాక్రమవంతమయిన పటాలము లున్నవి. ఇంగ్లీషువారును బెల్జియనులకు సహాయము చేయుటకు వచ్చుచున్నారు. కాని తత్కాలము జర్మనుల ఉగ్రము అపఁబడినను అనేక లక్షల సైన్యమును నోర్చింపఁగల శక్తి వారికి గలదని బెల్జియనులు చక్కఁగా గుర్తెఱింగి యుండిరి.

## జర్మనుల విజృంభణము

మ్యూజానదిని నూతనసేనలతో హైవద్ద దాఁటి లీజు, నామూరులకు మధ్యనున్న బెల్జియను అశ్వసేనను పారదోలి 2 లక్షలమంది జర్మను సైనికులు పశ్చిమమున బ్రసెల్సు ముఖ్యపట్టణమును పట్టుటకయి చనుచుండిరి. జర్మనుసమూహములముందు నిలువఁజాలక అతిపరాక్రమముతో పోరినను, బెల్జియనులు వెనుకకు తగ్గిపోయిరి. గీటు బెట్జువద్దను, బూడింజన్ వద్దను అశ్వసైనికులకు పోరు జరిగెను. రణరంగము ఆరుమైళ్ల పొడవుండెను. కాని శత్రుసేన అత్యధికముగుటవలన బెల్జియనులు చాల సేపు పోరి, గొప్పనష్టమును గలిగించి మరింత వెనుకకు తగ్గిరి. తరువాత డీస్టు, ఏర్ షాట్, టర్లిమాంట్, లోవేన్



పట్టణముల మీద ఎడతెగక జర్మను ఫిరంగుల ధార కురిసెను. టిర్లమాంట్ బ్రుసెల్సునకు 28 మైళ్ల దూరమందే కలదు. ఇచ్చట ఘోరమయిన యుద్ధము జరిగినది. మంగళవారమునాటి రాత్రి ఎనిమిది గంటలకు నిప్పంటుకొని టిర్లమాంటును, ఒక్కగంట పిమ్మట డీస్టును మండసాగెను. అనేక గ్రామములు చుట్టు ప్రక్కల తగులబడినవి. కాని యుద్ధము జరుగుచునే యుండెను. తరువాత బెల్జియనులు లావేన్ నగరము వదలిపోయి అచ్చట యుద్ధము నుపక్రమించిరి. ఈ యుద్ధములో మూడవ బెల్జియము సేన 600 మంది దిగంబరముల వలకను ప్రఖ్యాతిని గడించిరి. ఈ గుఱ్ఱపుదళము 10000 జర్మను కాల్బలము మీద దుమికి పెక్కండ్రను చంపిన తరువాత ఏడుగురు తప్ప మిగిలిన వారందరును వీరస్వర్గమున కేగిరి.

ఆరాత్రి పెక్కుమంది జనులు దిక్కులేక బ్రుసెల్సు నగరమునకు పోవ మొదలిడిరి. బెల్జియము రాజు ఆల్బర్టుగారు ఒక్క అంగరక్షకునితో తమమోటారుబండి నెక్కి పెక్కుతావుల దిరుగుచు జనులకు ధైర్యమును బురికొల్పుచు, సైన్యము ప్రాణ మొడ్డుకొనుటకు పోరాడునట్లు చేయుచుండిరి. ఒక సైనికుడు శ్రీవారిని "మహారాజా" అని సంబోధింపగా వాని చేతిని బట్టుకొని చిఱునవ్వు నవ్వుచు నన్నట్లు పిలువకుము. మన మందఱమిప్పుడు చెలికాండ్రము. నన్ను "ఆల్బర్టు అని పిలువుము" అని శ్రీవారనిన మాటలు దేశమంతట పెట్లో తెలిసి వారియందు ప్రజలకున్న ప్రేమ మరింత వృద్ధియయ్యెను. లెఫ్టినెంటు హెవ్వార్డ్ అను వాడు ఫిరంగులతో సమర్పబడిన తనమోటారుబండిని ప్రతియుద్ధము నెక్కి జర్మను సైనికులను వెంటాడుటకయి బయలుదేరి సుమారు డెబ్బది మందిని నొక్కడే చంపుట సుప్రసిద్ధము.

## అల్సేస్ లోరైన్

ఫ్రాన్సుమీద దాడివెడలుటకు జర్మనులకు రెండు మార్గములు కలవు. మొదటిమార్గము ఉత్తరమున బెల్జియము, లక్సెంబర్గులకును, దక్షిణమున స్విట్జర్లండునకును మధ్య ఫ్రెంచి-జర్మనీవారి సరిహద్దుగానున్న రెండువందల మయిళ్లపొడుగుభూమి. రెండవమార్గము బెల్జియములో ప్రవేశించి ఉత్తరఫ్రాంసు నాక్రమించుకొనుట. కాని యీరెండువందల మయిళ్ల సరిహద్దులలో ప్రతి ముప్పది మయిళ్లకును అభేద్యమగు కోటలను ఫ్రెంచివారు కట్టిరి. ఈకోటలలో వర్డన్, టూల్, ఎపినాల్, బెల్ఫోర్టు అనునవి ఒకటిక్రింద నొకటి గలవు. వీనిలో 10 లక్షల సైన్యము సకల యుద్ధపరికరములతో జర్మను శత్రు వచ్చినయెడల ఓడించుటకయి సర్వసిద్ధముగా నుంచబడెను. ఒక కోటకును నింకొక కోటకును మధ్యనున్న స్థలములో జర్మనులు పోవుటకు వీలులేనంత దూరము పారగల ఫిరంగు లుంచబడినవి. ఇచ్చట




ఫ్రెంచి, జర్మను సరిహద్దులు. వానియందలి కోటలు

లోరేన్ ప్రాంతమున నయిదుదినములు ఫ్రెంచివారు పోరి ఆల్సేసు మాగాణములకు మార్గములగు కనుమల నన్నింటిని పట్టుకొనిరి. ఫ్రెంచిసైన్యముల వెనుకభాగమునిరోధపడినయెడల ఆల్సేసును వదలునట్లు చేయవచ్చునని తలంచి మేక్ కోటను పట్టుకొనుటకయి జర్మనులు సేనను బంపిరి. ఒథయిస్ నదివద్ద జర్మనులు ఫ్రెంచివారిని పరాజితులను గా జేసి కనుమలనుండి తరిమిరి. క్రొత్తసైన్యమువచ్చుట వలన మరునాడే ఫ్రెంచివారు యుద్ధమునకు గడంగి జర్మనులను పూర్తిగానోడించి 1000 మంది ఖయిదీలను బట్టుకొనిరి. ఆగస్టు 12 మొదలు 14 వఱకును బాల్మంటు, సైరే, ఆవ్రికోర్టులవద్ద తీక్ష్ణ మయినపోరు జరిగెను. ఇచ్చట జర్మను లోడిపోయిరి. లోరేన్ మార్గములన్నియు ఫ్రెంచివారికి తిరిగి వశమయ్యెను. వీరు సైన్యమును తిరిగి ఆల్సేసుకు జనరల్ పా గారి యధ్యక్షతక్రింద పంపిరి. బెల్ఫోర్టునుండి వెడలి, థాన్ నుండి 14వ ఆగస్టున జర్మనులను పారదోలి ముల్హౌసుకు 12 మైళ్లలోనున్న థర్ గ్రామము నీయన పట్టుకొనెను. మరునాడు డన్నిమేరి గ్రామము వశమయ్యెను. కొన్ని దినము లీప్రాంతమునకు అటు నిటు జయము మరుమారుచు వచ్చెను. తరువాత డోర్నాకువద్ద జర్మనుల నోడించి పా గారు 24 ఫిరంగులను పట్టుకొనిరి. ఈ జయమువలన ఫ్రెంచివారు బెల్ఫోర్టుమొదలు కోల్మరువఱకు దేశమంతయు వశము చేసికొనిరి. ముల్హౌసు రెండవపర్యాయము ఫ్రెంచివారికి లభించెను. ఆగస్టు 18 వఱకు జరిగినపోరులలో ఆల్సేసు కున్న కనుమ మార్గములును, ఉత్తర ఆల్సేసును ఫ్రెంచివారివశ మయినవని చెప్పవచ్చును. ముమ్ముందు జర్మను లెంతగొప్పసైన్యమును బంపి ఆల్సేసు నెట్లు తిరిగి వశముచేసికొనిరని యిక చూడగలము.

## సముద్రయుద్ధ ప్రారంభము

ఈ మహాసంగ్రామము ప్రారంభము కాకముందు మూడుసంవత్సరములనుండియు సముద్రయుద్ధాంగమంత్రియగు విన్‌స్టన్ చర్చిలు గారి యధ్యక్షతక్రింద బ్రిటిషు యుద్ధనావ లధికముగా గట్టబడుటయే కాక ఏక్షణమందు యుద్ధము ప్రాప్తించిన ఆక్షణమందు సిద్ధముగా నుండునట్లొనరింపబడెను. జర్మను యుద్ధనావ లాకస్మికముగా వచ్చి పడకుండుటకయి యన్ని ప్రయత్నములును చేయబడెను. యుద్ధము ప్రకటింపబడగానే ఈశాఖయందు జెట్టితోపములకును, ఆలస్యమునకును అవకాశము లేకుండెను. జర్మను నావలు ఇంగ్లీషు ఛానలులో గాని అట్లాంటిక్ సముద్రములో గాని ప్రవేశించుట కున్న మార్గము లన్నియు మూయబడెను. వయస్సును బట్టి చిన్నవాడయినను బుద్ధిసామర్థ్యమునందు నిరుపమానుడగు సర్ జాన్ జెల్లికో గారు సర్వసేనాధిపతిగా నియోగింపబడిరి. ఆయన కొరకు మిక్కిలి ప్రియమిత్రుడును నగు రేర్ అడ్మిరల్ మాడెన్ గారు ముఖ్యోద్యోగులలో నొకటివాడుగా నేర్పాటుచేయబడెను.

## వర్తక మార్గములు

ఉత్తరసముద్రమునందు నావలను బ్రిటిషుద్వీపములను గాపాడుటకయి చక్కగా నియమించినతరువాత భోజనపదార్థములును, ఇతరసామగ్రియు, పరదేశములనుండి రావలసిన వర్తకమార్గములను కాపాడవలసిన పనిని అడ్మిరల్టీ (నౌకాంగశాఖ) వారు చేపట్టుకొనిరి. ఇంగ్లీషువారి వర్తకనావలను ముంచుటకయి పంపబడిన జర్మను క్రూయిజర్లు బ్రెస్లా, గోబెన్ అనునవి మధ్యధరాసముద్రములోను, క్రొన్‌ప్రిన్స్, కారల్స్రూహా అనునవి అట్లాంటిక్ మహాసముద్రములోను తిరుగుచుండెను. వీనిని ముంచుటకయి నెక్కు క్రూయిజర్లు పంపబడినవి. పైనావలలోని [illegible] లోనున్న స్కార్న్‌హార్స్టు, నెయిసెనా, ఎమ్డెన్ న్యూరెంబర్గు క్రూయిజరులు తప్పించుకొని పారిపోయినవి. ఒక దేశమునకు పోయినను వానిని పట్టుకొని నోడించుటకును [illegible] యుద్ధనావయు, రెండు ఆర్మర్డు క్రూయిజరులు, రెండు లయిటు క్రూయిజరులు, అనేకములయిన టార్పిడోబోటులు, సబ్మెరయినులు, ఆస్ట్రేలియా వారి బాటిల్ క్రూయిజరు, ఆస్ట్రేలియా లయిటుక్రూయిజరులు మెల్బోర్ను సిడ్నీ యను నవియు, వానివెనుక అత్యంతపరాక్రమవంతమయిన జపాను యుద్ధనావలన్నియు సముద్రములను గాచుటకయి యుండెను. ఇంగ్లీషు యుద్ధనావలన్నియు ఉత్తర సముద్రమును, ఫ్రాన్సు ఉత్తరతీరమును గాపాడుటకయి యుండుటచే, ఫ్రెంచినౌకలన్నియు మధ్యధరాసముద్రమును గాచుటకును, ఆస్ట్రియా నావలు ఏడ్రియాటిక్ సముద్రమును వదలి మధ్యధరాసముద్రములో ప్రవేశింపకుండ కాపలా యుండుటకును నియమింపబడెను. రష్యావారికి బాల్టిక్ సముద్రములోనున్న 4 యుద్ధనావలు, 1 ఆర్మర్డు క్రూయిజరు, కొన్ని చిన్న క్రూయిజరులు డిస్ట్రాయరులు, సబ్మెరయినులు, అవసరమయినప్పుడు జర్మనులకు తొందర కలిగించుట కున్నవి. మిత్రకూటమివారికున్న ఇంత నౌకాబలము ముందు, జర్మను, ఆస్ట్రియనుల కెంత బలము గలదో యీక్రింద వివరింపబడినది.

| వివరము | బ్రిటను | ఫ్రాన్సు | రష్యా | మొత్తము | జర్మని | ఆస్ట్రియా | మొత్తము |
|---|---|---|---|---|---|---|---|
| (1) డ్రెడ్నాటులు | 22 | 10 | ... | 32 | 13 | 3 | 16 |
| (2) బేటిల్ క్రూయిజర్లు | 10 | ... | ... | 10 | 4 | ... | 4 |
| (3) ప్రిడ్ నాటులు కాని యుద్ధ నావలు | 38 | 13 | 10 | 61 | 22 | 12 | 34 |
| (4) ఆర్మర్డు క్రూయిజర్లు | 47 | 27 | 12 | 86 | 9 | 2 | 11 |
| (5) లైట్ క్రూయిజర్లు | 66 | 8 | 2 | 76 | 45 | 11 | 56 |
| (6) డిస్ట్రాయర్లు | 202 | 80 | 95 | 377 | 133 | 15 | 148 |
| (7) టార్పిడో బోట్లు | 106 | 153 | 25 | 284 | 80 | 58 | 138 |
| (8) సబ్మెరయినులు | 7[illegible] | 50 | 25 | 141 | 24 | 6 | 30 |
| మిత్రకూటమివారివి అన్నియు కలిసి 1071 | | | | | శత్రువులవి మొత్తము 407 | | |

ఇక ఫిరంగులమాట విచారించెదమనిన 3.5 ఇంచి ఫిరంగులు ఇంగ్లీషు యుద్ధనావలలో 188 గలవు. ఈ శ్రేష్ఠమయిన ఫిరంగులు ఇంకొకరికి లేవు. 12 ఇంచి ఫిరంగులు మిత్రమండలికి 500 లును, శత్రుమండలికి 158 యు గలవు. 11 ఇంచి ఫిరంగులు శత్రువులకు 90 ఎక్కువగా గలవు. 4.7 యించి ఫిరంగులు, 4 ఇంచివి, 3.9 ఇంచివి మిత్రమండలివారికి 302 అధికముగా గలవు. 65 ఇంచి, 6 ఇంచి 5.5 ఇంచి ఫిరంగులు శత్రుమండలికి 110 హెచ్చుగా నున్నవి. ఇటలీగూడ యుద్ధములో దిగుటవలన మిత్రమండలియొక్క బలము మిక్కుట మయినదని వ్రాయనవసరము లేదు.

యుద్ధము ప్రకటింపఁబడిన పదిదినములలో జర్మనుపతాకము నెగురవేయుచున్న సముద్రమునిూఁది వర్తకనావలన్నియు ఇంగ్లీషు యుద్ధనావలచే ఒక్క ఫిరంగికాల్పుబడకుండ పట్టుకొనబడెను. కనుక దినములలోనే జర్మనీవారి ఎగుమతి వ్యాపారము అంతరించెను. కొన్ని జర్మను వ్యాపారనావలు తటస్థదేశముల నౌకాశ్రయములకు పరుగెత్తి శరణుచొచ్చెను. జర్మనీవారికున్న యోడల మొత్తము 100 టన్నులకు మించినవి 2090. ఇంగ్లీషువారివలన పట్టుకొనబడినవి 129. జర్మను రేవులలో నున్నవి 738. బాల్టికు, నల్లసముద్రములలో నుంచబడినవి 71. మిత్రమండలివారి రేవులలో నున్నవి 166. తటస్థదేశపు రేవులలో శరణుచొచ్చినవి 646. లెక్కకురాకుండ 500 టన్నులకు పైగానున్న యోడలు 125. లెక్కలేని చేపలపోట్లు 853. చిన్న పడవలు మాయ మయినవి 381. జర్మనీవారి గ్రేఫ్ డెర్ క్రూయిజరు ఆగస్టు 5-వ తేదిన లూసిటానియా యనునావను ముంచ జూచెను గాని యది చిక్కలేదు. ఈలూసిటానియాయే తరువాత ఈసంవత్సరము మేనెలలోసబ్మెరయిను వలన ముంచివేయబడినది. లూసిటానియాకు సోదరనౌకయగు మారిటానియాను కార్ల్స్రూ క్రూయిజరు అట్లాంటిక్ సముద్రములో పట్టుకొనజూచెను గాని ఎసెక్సు క్రూయిజరు వచ్చి దానిని రక్షించెను. ఆగస్టు



5-వ తేదిని సముద్రములో గనులను విచ్చలవిడిగా వెదజల్లుచున్న జర్మనువారి కోనిగిన్ లూయి యనునావను ఆంఫియన్ అను ఇంగ్లీషు లైటుక్రూయిజరు ముంచివేసెను. కాని ఆంఫియన్ యుద్ధనౌకయు మరునాఁడుదయమున కోనిగిన్ లూయి వెదజల్లిన గనులలో నొకటి తగిలి మునిగిపోయెను. ఇందలి నావికులలో 139 మంది తప్ప తక్కినవారు కాపాడఁబడిరి. ఆగస్టు నెలయంతయు జర్మనుయుద్ధనావలు బయలుదేరి యుద్ధమునకు వచ్చునేమోయని ఆంగ్లనౌకలు నోరు తెరచుకొని యుండెను. కాని యొక జర్మను అడ్మిరలు జర్మను యుద్ధనావ లెందువలన పోరాడవో కారణముల నిట్లొక యుపన్యాసమునందు దెలిపెను. “మనము [illegible] ఇంగ్లీషువారితో సముద్రమునిూఁద పోరితిమేని యోడిపోవుదుమనుట నిక్కువము. పోయిన నావలకు బదులుగా క్రొత్తనావలను కట్టుటకును, అవి ఈయుద్ధమునకు పనికివచ్చునటుల ను వీలు ఎంతమాత్రమును లేదు. సముద్రయుద్ధములో తక్కువ బలముగల పక్షము ఓడిపోతిమేని మన సముద్రతీరమంతయు శత్రువులచేత ధ్వంసముచేయఁబడి జర్మనుభూమిపయిని మనశత్రువులు దిగి యుద్ధముచేయుటకు తరుణము సమకూరును. మన యుద్ధనావలను కదల్పకుండ కాపాడుకొంటిమేని సంధి జరుగునప్పుడు మనమాటలు ఆదరముతో ఆలకింపబడును. మన మిప్పుడు బలహీనులముగా పలుకవలసిన యవసరముండదు.” ఇందువలన సముద్రయుద్ధమునకు జర్మనులు దిగక సబ్మెరయినులచేత హానిని కలిగింప వలయునని తలపెట్టి యున్నారు. ఆగస్టు 11-వ తేదిన జర్మనుసబ్మెరయినులు బ్రిటిషు క్రూయిజరగు బర్మింఘమును టార్పెడో వేసి ముంచుటకయి రాగా ఈ యుద్ధనావయు, కొన్ని బ్రిటిషుడిస్ట్రాయరులును వానికి నష్టము కలుగచేసి తరిమివేసెను. ఈరీతిగానే జర్మనుసబ్మెరయిను 15 యు నెంబరుగలదానిని బర్మింఘము క్రూయిజరే సముద్రములో ముంచి వేసెను.



గమనిక:—300 మొదలు 1000 రతులవరకు బరువుగల తుపాకి మందుతోను మరి యితరములగు ప్రేలుడు పదార్థములతోను చేయబడును. తరంగము లెంత తీవ్రముగానున్నను సముద్రపు పైభాగమునకు 9 లేక 10 అడుగుల లోతునందిది కదలక నిలిచియుండును. ఆమార్గమున ప్రయాణము చేయుచుండు నావకు తగులగానే గంధకద్రావకమున్న యొకగొట్టము పగిలి లోపలనున్న ప్రేలుడువస్తువగు క్లోరేట్ ఆఫ్ పొటాషును నిప్పంటించును. అది లోపలనున్న యితరపదార్థములకు సయితము నిప్పంటించి పిడుగుకంటె ధ్వనితో నావను బ్రద్దలుచేయును. హార్బరులలో పెట్టబడు గనులు యింకొకమాదిరికూడ గలవు. పెట్టబడిన గనిపయికి శత్రునావ రాగానే చూచి ఒడ్డునుండి విద్యుచ్ఛక్తితో గనిని ప్రేల్చి నావను ముంచుదురు.

ఎ. (క) పొగఓడనుండి ఆగ్నేయాస్త్రము వేసినపుడు లోపలిత్రాడు జారుటను చూపుచున్నది. (చ) క్రిందనున్న బరువువలన లంగరుపెట్టె క్రిందికి జారును. (ట) బరువు నీటియందు నేలను చేరుట. (ఠ) లంగరుపెట్టె భారమువలన బరువు బలముతగ్గి మైను నీటిక్రిందికి జారుట.

కుడిపైపున నావ మైనుకు తగిలి ప్రేలురీతి చూపబడినది. [రెండవ విధమైన మైను] బి. (గ) తేలగబెండులవలన నీటియందు తేలునటులు చేయబడును. (జ) మైనులకు కట్టినత్రాడు. (డ) త్రాడును బిగువుగనుంచెడి బరువు. (ఢ) మైనును తేలనిచ్చెడి పెట్టె. (బ) మైను ఈమైనులందు నావలుత్రాడును తగిలి ఈడ్చినపుడు మైను ప్రేలి నావను ముంచును.

1 తేప. 5 మైనుకు కట్టినత్రాడు. 8 లంగరుపెట్టె. 10 నీటియడుగున నెంతలోతుగ మైనుయుండవలయునో [నిర్ణయించెడి త్రాడు.
2 ప్రేల్చెడిభాగము 6 తేలుటకై గాలి నింపిన పెట్టె. 11 మైనురూపము.
3 పొడిచెడి మేకు. 7 మొదట పొగఓడకు తగిలెడి లివరు. 9 బరువు. 12 త్రాడుచుట్టిన గిలక సి. మైనును ప్రేలాడదీయుటకు [కొక్కెము

| | | | |
|---|---|---|---|
| పొగవోడలపైన మైనులు నీటిలో వేయక పూర్వము వ్రేలాడుచుండెడి విధము. | మైను నీటియందు నిలిచియుండు రీతి. | మేకు ఊడి (మ) యందు గనుపరచిన చివర అక్షమునుండి నిలువుగా తిరుగుట. | ఊడిన మేకు కేపును వ్రేల్చుటవలన మైను వ్రేలి వోడలను ముంచును. |



## రుష్యా రణరంగమున బ్రవేశించుట

యుద్ధమునకు కొంతకాలము మునుపు బూర్వము రష్యాదేశము శాంతి భూయిష్ఠమయియుండెను. పరిశ్రమలవలన జీవించువారు సమ్మెకట్టులు కట్టి నానా కొల్లరులు చేయుచుండిరి. "వీరా జర్మను యష్టోకీలను నెదిరింపగలట్టివారు!" అని జర్మనులు నవ్వుచుండిరి. కాని యుద్ధము శాంతిని రాజభక్తిగా మార్చివేసెను. తన 'చిన్ని తమ్ములగు' సర్వీయనులను ఆస్ట్రియా దురాక్రమమునుండి కాపాడుటకయి, రష్యను భల్లూకము కత్తిని దూసెను. రష్యా ప్రభుత్వము మెడ అపనమ్మకము గలిగియున్న పోలులకు తగిన వాగ్దానములఁ జేసియు, ఫిన్లండు ప్రజలకు స్వపరిపాలన నొసంగెదనని ప్రకటించియు, ఆస్ట్రియాలో భాగమగు గేలీషియాలోని స్వజాతివారగు స్లావులను తమలోఁ జేర్చి భాగ్యాభ్యుదయమును గోరుదనని యుత్సాహపఱచియు, రష్యాలోని యూదులను తృప్తిపఱచియు, వారి కట్టిభయము లేకుండఁ జేసియు, తన సామ్రాజ్యమంతటను జారుగారు దేశభక్తి సహితముగా బహిష్కరించిరి. జూలయి 28-వ తేది యుద్ధము ప్రారంభమయినది. 2వ ఆగష్టున కప్పుడే కొంత రష్యను సేన జర్మనీలో ముఖ్యరాజ్యమగు ప్రష్యా సరిహద్దులలో బ్రవేశించెను. ఇంతకుముందు స్వల్పమగు రష్యా నావికబలమును జర్మని ఫిన్లండు గల్ఫునందు మూసివేసి ఆలాండుద్వీపమును వశము చేసికొనియెను. రష్యామీద నేల యుద్ధమునకు జర్మని 15 లక్షల సైన్యమును సిద్ధముగా నుంచినది. రక్షణములేని సరిహద్దులలోని అనేకములగు రష్యా గ్రామములను ముందుగా జర్మనులు తగులబెట్టి ప్రజలను నానాకష్టములపాలు చేసిరి. ఈ యుద్ధములో మొట్ట

మొదటి 15 దినములును చిన్న చిన్న పోరాటములతో గడచిపోయినది. తూర్పుప్రష్యాలో ముఖ్యపట్టణములలో నొక్కటియగు ఇట్కూనెన్ ను రష్యావారు పట్టుకొనిరి. జర్మనులు వారమువినములు భగీరథప్రయత్నములను పట్టణమును తిరిగి సంపాదించుటకయి చేసిరిగాని జయింపలేరు.

రష్యా యుద్ధభూమికి 80 లక్షలసైన్యమును సిద్ధముచేయుచున్నదియను వార్తను విని ఫ్రెంచి, ఇంగ్లీషువారికి కలిగినయానంద మింతంత కాదు. బెల్జియముదేశములో సైన్యబాహుళ్యమువలన రెక్కయుప్పమువచ్చినట్లు విజృంభించుచున్న జర్మన్ వెనుకభాగమున రష్యా తాంకట విక్రమండలికి పశ్చిమరంగమున పెంతో సహాయకారియని తలంపబడెను. మహాప్రభు నికోలాస్ గారి సైన్యాధిపత్యముక్రింద ఒక సైన్యము గలీషియామీఁదికిని, మరియొక సైన్యములో భాగము విల్నానుండియు, రెండవభాగము వార్సానుండియు తూర్పుప్రష్యామీఁదికిని వెడలెను. ఈప్రయత్నములు కొన్నింటికిని ఒక్కనెల పట్టెను. ఈ రెండవసైన్యముమీఁద గుంబిన్, బాజోలకన్, సైదేకెలోపులవద్ద జర్మనులుపోరాడి దెబ్బలుతినిపారిపోయిరి. స్టాల్లుపోనెన్ వద్దజరిగినయుద్ధము తూర్పురంగమున జరిగినవానిలో మొట్టమొదటి గొప్పయుద్ధమని చెప్పవచ్చును. ఇప్పటిజర్మనులు రష్యావారితో కడు తెంపుతో పోరాడిరి. వెనుకభాగమునుండి వార్సామీఁదుగా వచ్చుచున్న సైన్యము పైతము జర్మనులనిప్పటిముట్టడించెను. జర్మను సేనాధిపతి కిప్పట నేమియు తోచలేదు. అతని సన్నాహములన్నియు వంటుగలిసెను. తన


లాటిన్ ప్రాంతమున ఆస్ట్రియను గుఱ్ఱపుదళమును భస్మముచేసిన కోసక్కు అశ్వసైనికులు

ప్రక్కన వచ్చిన జనులను పూడ్చిపెట్టుటకయిన కొంతకాల మొసంగవలసినదని రష్యాసేనానినడుగగా వారు ఒప్పుకొనలేదు. జర్మనులు రెండు సైన్యములమధ్య అనుదినములు పోరి పూర్తిగా నోడిపోయి పరుగెత్తిరి. గంబిన్నెను అను మరియొక ప్రదేశమున జర్మనులుపంచి అనుకూలమయిన స్థలమునుండి పోరినను, జయింపజాలకపోయిరి. ఈ యుద్ధములో రష్యాలోని గొప్పకుటుంబములకు చెందినయావనులును రష్యాపార్లమెంటులోని డ్యూమాసభ్యులును, సాధారణ సైనికులవలె పోరి తమ మాతృదేశచారిత్రమునకు గీర్తి దెచ్చిరి. ఇప్పటినుండి ఇన్‌స్టర్ బర్గు, కోనిగ్సుబర్గు, ఆలెన్‌స్టైన్ మున్నగుసుప్రసిద్ధ దుర్గములను 100 మైళ్లు రణరంగమునుండి నడచుచు, పట్టుకొనుటకయి రష్యనులు పెద్ద సైన్యములను దెప్పించుకొనిరి. జర్మనులకును కావలసినంత సహాయము పంపబడెను. నీడెంబర్గు, విల్లెన్‌బర్గు, అల్లెన్‌బర్గుకోటలు తరువాత రష్యనుల వశమయ్యెను.

### ఆస్ట్రియామీఁద దాడి

పెక్కువందల మైళ్లు సరిహద్దులు రష్యాకుండుటవలన ఎక్కువ టనయినను కొద్దిపాటి యల్లరులు కలిగించుటకు శత్రువులకు సులభము. ఒక ఆస్ట్రియను గుఱ్ఱపుదళము నిరాటంకముగా లెంబర్గుమీఁదికి కదలెను. వారు త్వరలోనే రాన్ పట్టణము వఱకు వెళ్లి దోచుకొని వచ్చుచుండగా లాటిన్ గవర్నరుగారు 5000 కోసక్కు అశ్వసైనికులను ఒక నదీతీరమునందు దిట్టముగా గడ్డిపెరిగినచోట దాచియుంచిరి. లాటిన్ ప్రాంతమున ఆస్ట్రియను గుఱ్ఱపుదళమును భస్మముచేసిన కోసక్కు అశ్వసైనికులు ఆస్ట్రియనుల సామీప్యమునకు రాగానే ఆకస్మికముగా వారిమీఁద పడి అందరిని బురదలో త్రొక్కివేసిరి. ఈసేనలోనున్న ఒక్క ఆస్ట్రియనుయినను స్వదేశమును తిరిగి చూడలేదు. గలీషియామీఁదికి పంపబడిన రష్యనుసేన చాలపట్టణములను పట్టుకొనెను. బుకోవినా యను రాష్ట్రములోని ప్రజలు రష్యనులకాహ్వాన మొసంగి తమ రక్షకులని వారిని మన్నించిరి. ఆస్ట్రియను దేశములోని గంబిన్నెన్ మెల్కెనెన్ కోవర్లెన్, లైక్ మొదలగు తావులు రష్యనులచేతిలో బడెను. ఈయుద్ధములో రష్యనులు 240 మైళ్లు పొడవునున్న రణరంగమునందు పోరుచుండిరి.

రష్యనుభూమిలో ప్రవేశించిన జర్మనులు రష్యను పోలండులోని కలిష్ అను కోటను పట్టుకొని డెంబ్రోవ అను జిల్లానంతయు నాక్రమించి, ఈ జిల్లా గనులతో నిండినదగుటచేత, తనకు వీలయినంతభాగము జర్మనీకి ఎగుమతి చేసిరి. ఈ కలిషునగరపు ప్రజలను లెస్సగా హింసించిరట. ఈనగరముమీఁద 50,000 రూబులు అపరాధము విధింపబడెను. ఈ క్రూరకృత్య చారిత్రమును వినిన రష్యనులు రోషావేశులయి మరింత దృఢముగా పోరుటకు సంకల్పించుకొని యుండిరి.

M. SOZONOFF



రుష్యా విదేశాంగ మంత్రి ఎం. సోజోనోఫ్

ADMIRAL GEORGEOVITCH



అడ్మిరలు జార్జియోవిచ్ రుష్యను యుద్ధ నావాంగమంత్రి

KING OF MONTENEGRO



మాంటినీగ్రో రాజు

CROWN PRINCE OF AUSTRIA



ప్రస్తుత ఆస్ట్రియా యువరాజు



GRAND DUKE NICHOLAS



గ్రాండ్ డ్యూక్ నికోలస్. రుష్యా సర్వసేనాధిపతి

GENERAL IVANOFF



జనరల్ ఇవనోఫ్. రుష్యా నైరృతి సేనాధ్యక్షుడు

GENERAL RENNENKAMPH



జనరలు రెన్నెన్ కాంఫ్

GENERAL SAMSONOFF



కీర్తిశేషుడయిన జనరలు సాంసనోఫ్

ఈ కోట పడకుండనున్నచో ప్యారిసు సామీపమునకు సులభము, శత్రువులు వెళ్లుట కవకాశ ముండ నట్టిది. ఫ్రెంచివారు నామూరును రక్షించుటకయి పంపిన సహాయము ఆలస్యముగా చేరినందున ప్రయోజనము లేకపోయెను.

## మాలిన్సు, ఆస్టెండులు జర్మనుల వశమగుట

24.వ తేదీన బెల్జియము సేన ఆంట్వెర్పునువదలి బ్రుసెల్సుకు పడమట 14 మైళ్లలో నున్న లోండర్ జీలు అను చోట మూడు జర్మను డివిజనులతో దలపడెను. జర్మనులు విల్వోర్డ్ వరకును తరుమబడిరి. పరు గెత్తుచు వీరు మాలిన్సు క్రైస్తవాగారమును పాడుచేసి పోయిరి. జర్మనులు బ్రుసెల్సునుండి, తిరిగి 40,000 సేనతో వచ్చి బెల్జియనుల కోడించుటచే వారు ఆంట్వెర్పునకు పరుగెత్తిరి. మాలిన్సువద్ద బెల్జియము రాజుయొక్క మోటారుబండి ముందరనే ఒక షెల్లు బ్రద్దలాయెను. దైవవశమున ఆయన కపాయము కలుగ లేదు. బండియొక్క చక్రములు తునక లయినవి. మాలిన్సునుండి జర్మనులు సముద్రతీరమున నున్న ఆస్టెండుకు వెళ్లిరి.

ఇక్కడ కొన్ని దండలు పట్టుకొనియున్న బెల్జియము సేన బాగుగా పోరాడెను. ఇంగ్లీషు సముద్రసేన 7000 ల మంది నేలమీద నావికా ఫిరంగులతో ఆస్టెండులో ప్రవేశించి బెల్జియనులకు చాల సహాయముచేసి ఆనగరమును కొన్ని దినములు కాపాడెను. కాని జర్మనులు అనేక వేలతో వచ్చుటవలన ఇంగ్లీషువారికలు రోడ లెక్క తరలి పోయిరి. ఆస్టెండు జర్మనుల వశమాయెను.

## ఛార్లీ రాయి యుద్ధము

ఇప్పటికి ఇంగ్లీషువారి సేనయు ఫ్రెంచివారి సేనయు నధికముగా బెల్జియమును చేరెను. ఇంగ్లీషువారు మాన్సు నాక్రమించుటకయి పంపబడిరి. ఛార్లీరాయిని రక్షించుపని ఫ్రెంచివారు పెట్టుకొనిరి. 21.వ ఆగస్టు శుక్రవార ముదయ మూడుగంటలకు శత్రువులు వచ్చుచున్న వార్త తెలిసినది. 7 గంటలకు వారి మొదటి ఫిరంగిగుండు ఛార్లీరాయిలో పడినది. జర్మనుల మీదపడుటకయి ఫ్రెంచివారి ఆఫ్రికా అధినివేశములనుండి వచ్చిన (అరబ్బులకును, నీగ్రోలకును బుట్టినవారగు) టర్కోలు వదలబడిరి. వీరందరును మహోగ్ర దీయులకుండు వీరావేశముతో జర్మనులతో మతిసాహసముతో బోరిరి



ఫ్రాన్సులో మొట్టమొదట దిగిన ఆంగ్ల సైనికులకు ఫ్రెంచివారొసగిన స్వాగతము



ఈ మధ్య జర్మనులతో పోరాడుటకయి వచ్చిన టర్కో (నీగ్రో) సైనికులకు ఫ్రెంచి గృహస్థులొసగిన మొనగులు

బల్లెములతో జర్మనుల శరీరములను చీల్చిరి. కాని ఒక ప్రాతకరాగ్నిగారములో దాచియుంచబడిన యంత్రపు ఫిరంగులు వీరి రూపుమాపెను. ఒక్కపటాలములో 100 మంది మాత్రమే గాయములు తినక తిరిగి ఫ్రెంచివారిలో కలియ గలిగిరి.

GERMAN ATROCITIES ON FRENCH FAMILIES



ఒక ఫ్రెంచిగ్రామములో గృహిణిని బిడ్డలతో వెడలగొట్టి ఇంటిలోని పడక మీద జర్మనుసైనికుడు విహరించు చున్నాడు.
ఒకచేతియందు సారాయిబుడ్డి రెండవచేతిలో తుపాకి వీనికిగలదు

FIERCE HAND TO HAND FIGHT WITH HUNS IN A BED ROOM



ఒక యింటిలోని పడకగదిలో స్త్రీలకు బదులుగా ఫ్రెంచిసైనికులు దాగియుండి జర్మనులను పొడుచుట

GENERAL VON KLUCK



జనరలు వాన్ క్లక్

FIELD MARSHAL VON HINDENBURG



ఫీల్డుమార్షలు వాన్ హిండెన్ బర్గ్

DUCHESS OF LUXEMBURG



లక్సెంబర్గ ప్రభ్వీణి

f

QUEEN OF HOLLAND



హాలెండు రాణి

EMPEROR OF JAPAN



జపాను చక్రవర్తి

COUNT OKUMA



జపాను ముఖ్యమంత్రి ఒకూమా ప్రభువు

PRINCE HENRY OF HOLLAND



హాలెండు రాణిగారి భర్త ప్రిన్సు హెన్రీ

A VETERN SUBADAR MAJOR



45 వ రాటురే సిక్కు పటాలములోని వృద్ధుడగు సుబేదారు మేజరు




టార్పిడో మర




టార్పిడో



టార్పిడో చేసిన ఘాతము

## రష్యా జయములు

జనరలు వాన్ క్లక్కు గారి సైన్యపు ఫిరంగులధ్వని ప్యారిసునగరములో వినబడుచుండగా రష్యనులు తూర్పుప్రష్యాను, గలీషియాను పట్టుకొనుట కయి సర్వప్రయత్నములను జేయుచుండిరి. మొట్టమొదట ఆకస్మికముగా ఫ్రాన్సునోడించి తరువాత రష్యను మట్టుపెట్టవచ్చునని తలంచిన కైజరుగారి యుక్తి లేనియు కొనసాగలేదు. రష్యా తూర్పుప్రష్యాలో ప్రవేశించుటవలన పడమట ఫ్రాంసు ఇంగ్లండులమీది దుడుకు తగ్గెను. జనరలు సాంసనోఫ్ క్రిందను చాలదేశమును రష్యను లాక్రమించుకొనిరి. జర్మనీ వారు ఒకదిక్కు నుండి రష్యనుపోలండులో ప్రవేశించుటకును, ఆస్ట్రియా వారు గలీషియానుండి దక్షిణముగ రష్యారాష్ట్రిమగు లబ్లినును నాక్రమించుకొని, ఇచ్చట జర్మనులతో గలిసి రష్యను సేనలను హతము చేయుటకును వ్యూహములు పన్నబడి యుండెను. ఇందుకయి ఆస్ట్రియనులు లబ్లినుమీదికి కదిరిరి. ఆస్ట్రియావారి సత్తువ తెలిసియున్న రష్యావారు సైన్యమును రెండుగా విభజించుకొని త్రికోణమువలె వ్యూహమును పన్ని రెండు సేనలును ఆస్ట్రియాలోని గలీషియాకు ముఖ్యపట్టనమగు లెంబర్గులో గలుసుకొనునట్లు సంకల్పించిరి. లెంబర్గులో లబ్లినుకు వెళ్లిన సేనకు సహాయము చేయుటకయి ఆస్ట్రియను లుంచిన మూడు ఆర్మీకోరులును, మూడు అశ్వసేనలును (డివిజనులు) గలవు. వీనిమీద రష్యనులుపడి జనరలు రసీగారి యాధిపత్యము క్రింద లెంబర్గు నాక్రమించుకొనిరి. లెంబర్గుపట్నము పడినదో అప్పుడే

వెనుకనుండి రష్యనులువచ్చి మీదపడకుండుటకయి లబ్లినుఆస్ట్రియను యనులు విడిచి పెట్టవలసివచ్చెను. ఝావాలీసాపానదీ ప్రాంత్యమున 20000ఆస్ట్రియనులు హతులయిరి. 140 మైళ్ల దేశమును 17 దినములలో దాటి గలీషియాలోనున్న ఆస్ట్రియనుసేనను రష్యను లోడించుచుండిరి. హాలిక్సువద్ద జరిగిన పోరులో ఆస్ట్రియనులు 5000 సైన్యమును గోలుపోయిరి. ఒకచోట 25 మంది కోసక్కులు 282 మంది ఆస్ట్రియను లుండుటను జూచి 8 టిట్టీలుగాచీలి అన్నివైపుల నుండి రు ఘోల్లున కేకలు వేసిరి. అనేక వందలమంది వచ్చుచున్నారని ఆస్ట్రియను లాయుధముల నేలమీద వేసి "మా దేవుడును మీ దేవుడే" మనివశమయిరి."

లెంబర్గు నాస్ట్రియనులు వదలి పరుగెత్తినప్పుడు అనేకవేల తూటాలు, 300 ఫిరంగులు 30 రయిలు ఇంజనులు ఇతర సామానులు విజయుల వశమాయెను. రష్యనులకు చిక్కిన ఖయిదీల మొత్తము డెబ్బదివేలు. అనేక పురజనులు నగరమును విడిచి వియ్యన్నాకు బరుగెత్తిరి. కాని పురజనులమీద ఒక్క ఫిరంగి యయిన కాల్చబడ లేదు. ఒక్కదమ్మిడి రొక్కమయిన సంగ్రహింపబడ లేదు. ఒక్క దౌర్జన్యమయిన చేయబడలేదు. తరువాత జనులే రష్యనుల కాతురతతో నాహ్వానమొసంగిరని రష్యావారు ప్రకటించిరి. లెంబర్గుకు ముప్పది మైళ్లదూరములో నున్న హాలిక్జ అనుపట్టణము లెంబర్గు పడిన 24 గంటలలో రెండు దినములు కఠిన యుద్ధము జరిగిన పిమ్మట జనరలు బ్రుస్సీ లోఫ్ గారిచేతిలో బడెను. లూబ్లిను నగరమును పట్టుటకయి వెళ్లిన ఉలకుల ఆస్ట్రియను సేనగతి శోచనీయ మయినది. లెంబర్గును బట్టిన రుస్కీగారొక దిక్కునుండి, హాలిక్జను బట్టిన బ్రుస్సిలోఫ్ గారింకొక వయిపున, అంతకు ముందు లూబ్లిను ప్రాంతములో నున్న రష్యను సేన మూడవ పార్శ్వమునుండి ముట్టడించగా ఆస్ట్రియా జనరలు వాన్ ఆఫెనుబర్గు గారు తాళజాలకపోయిరి. రష్యను లీ సేవలో జాలభాగము నోడించి ఖయిదీలను చేసిరి. ఈ యపజయమునకయి ఆఫెన్ బర్గుగారును, మరి యిరువురు జనరలులును పనినుండి తొలగింపబడిరి. లూబ్లిను యుద్ధము 3 వారములు 200 మైళ్లవిశాలభూమి మీద జరిగినది. జర్మను సైన్యములుగూడ సహాయమునకు వచ్చెను.



రష్యా సైనికుడు

జర్మనులవి కెయిజరుగారి దస్కతు గల 30 ఫిరంగులు సయితము రష్యనుల వశమయ్యెను. ఆస్ట్రియావారి బుకోవినా రాష్ట్రమును, దాని ముఖ్యనగరమగు ఛర్నోవిక్సును రష్యను లాక్రమించుకొని నప్పుడు పురపాలకుడే రష్యావారు ప్రజలను బహున్యాయదృష్టితో జూచుచున్నారని ప్రకటించ గలిగెను. దీనితో పోలెండులో జర్మనులు పట్టుకొని నాశముచేసిన కాలిష్ నగరదుస్థితిని విచారించినప్పుడు రష్యా జర్మనుల పరిపాలనా పద్ధతులలో గొప్ప తారతమ్యము జూపట్టకపోదు. ఇచ్చట రష్యను ప్రజలలో పరువుచువారిని పట్టుకొని, ఫిరంగులలో కట్టి సైన్యమునకు ముందు బెట్టి, రష్యనులపయిన జర్మనులు కాల్చుచునిరి. కాల్చినయిండ్ల దంపి వేసెదమనిరి. నగరమును ఇష్టమువచ్చినట్లు మేజరు ప్రూసు గారు దోచుకొనిరి.

ఆస్ట్రియావారు రష్యావారి మీదికి పంపిన లూబ్లిను, లెంబర్గు సైన్యములు వెనుకకు పారిపోయి ఒకటి క్రాకోకును, రెండవది ప్రెమి సులుకును చావు తప్పి చేరెను. ఈ ప్రెమిసెలుకోట ఈ సంవత్సరములో ఏప్రెలు నెలలో రష్యనుల వశమయినది. తిరిగి జూన్ నెలలో ఆస్ట్రియా, జర్మనీ సేనలు రష్యనుల నోడించి, పారదోలి ప్రెమిసెలును వశము చేసికొనియెను. ఈ గలీషియా యుద్ధములలో రష్యను సేనలో సగము భాగము మృతినొందిరో, జబ్బుపడిరో, గాయములు తినిరో పనికిరారయిరి ఆస్ట్రియనులలో 2,50,000 మంది నిహతులయిరి. 1 లక్షమంది ఖయిదీలుగా జిక్కిరి. 400 ఫిరంగులు రష్యావారిచేతిలో బడెను ఈ గలీషియాలోనున్న స్ట్రిజావద్ద కెరోసి నాయిలు భూములు సాలుకు 117 కోట్ల రూపాయిలు లభించునట్టి యావత్తును రష్యనుల వశమయి వారికి మహదైశ్వర్యమును సమకూర్చెను. ఈ నూనె భూములు ఆస్ట్రియా జర్మనీలకు విమానములకు, మోటరులకు కావలసిన నూనెను సప్లయి చేయుచుండెను. ఇప్పుడది పోవుటచే కిరోసినాయిలు సప్లయి విషయమయి వారికి భయము కలిగెను. కార్పేథియను కనుమలను వశముచేసికొని అతిసారవంతమయిన హంగరీలోని డాన్యూబు మాగాణములమీద దిగవలయునని రష్యను కోసక్కులు తగిన ప్రయత్నములను చేయుచుండిరి.

ADMIRAL SIR JOHN JELLICOE



ఆంగ్లయుద్ధనౌకాదళాధిపతి: అడ్మిరల్ సర్ జాన్ జెల్లికో

ADMIRAL LORD FISHER



అడ్మిరల్ లార్డు ఫిషర్

REAR ADMIRAL MADDEN



రేర్ అడ్మిరల్ మాడెన్ : దళోపదళాధిపతి

REAR ADMIRAL MOORE



రేర్ అడ్మిరల్ మూర్

ADMIRAL SIR HENRY JACKSON



మధ్యధరాసముద్రములోని యుద్ధనౌకాధిపతిః అడ్మిరల్ సర్ హెన్రీజాక్సన్

COMMODORE TYRWITT



కమడోర్ టైర్‌విట్

REAR ADMIRAL BEATTY



రియర్ అడ్మిరల్ బియాటి

COMMODORE KEYS



కమడోర్ కీస్

GURKHAS MARCHING TO THE FRONT



గూర్ఖాలు రణభూమికి నడచుట

THE DEADLY KUKRI



భయంకరమగు గూర్ఖాల కత్తులు

ఒరనుండి దీని కొకపర్యాయము దూసినచో వారి గూర్ఖాలధర్మము ప్రకారము రక్తమును కార్చి తీరవలయును. ఒరలో మరికొన్ని చిన్న ఖడ్గములును ఉండును.

ఇంగ్లీషువారినావ లేవియు నష్టపడలేదు. డిసంబరు 10వ తేదిని ఒక బ్రిటిషు జలాంతర్గామి డార్డనెల్సు జలసంధిలో ప్రవేశించి అయిదు పంక్తుల గనులను తప్పించుకొని మెసూదియా అను పెద్ద యుద్ధనావను టార్పెడో వేసి ముంచి తప్పించుకొని దాటి పోయెను. జర్మను క్రూయిజరులను ఇంగ్లండునకు తూర్పుతీరమందున్న స్కార్బరో, విట్బీ, హార్టిల్పూలు భాగములమీద ఫిరంగులనుగాల్చి డిసంబరు 16వ తేదిని గొప్పనష్టమును గలిగించెను. 200 మందికి గాయములు తగిలెను. కొంతమంది చచ్చిరి.

## ఆకాశ రంగము

ఫ్రాంసులో నొక రయిలుస్టేషనుమీద జర్మనువిమాన మెగురుచుండగా నవంబరు మొదటితేదిని రయిలు నెక్కబోవుచున్న యిండియనులు దానిని కాల్చి నేలకూలంజేసిరి. నవంబరు 6వ తేదిని బెల్జియములోని బ్రూజెసుపయిని మిత్రమండలివారు బాంబులను వేసిరి. కొన్ని సిపాయిలు చెరువుల సామీప్యమున పడెనుగాని మీద పడలేదు. రైనువద్ద రెండు మిత్రమండలివారి విమానములు జెప్పెలిను నహారాపయి బాంబులనువేసి దారిని దాటి ప్రక్కకు నవంబరు 18వ తేదిని వెళ్లెను. ఫ్రెంచివారు క్రుప్పుకర్మాగారముపై డిసంబరు మొదటివారములో బాంబులను వేసిరి. నష్టమెంత సంభవించినదియు తెలియలేదు. డిసంబరు 24వ తేదిని ఇంగ్లండులోని షియర్‌నెస్‌మీద జర్మనువిమానములు బాంబులను వేయుటకయి రాగా ఇంగ్లీషువైమానికులు వారిని పారదోలిరి. అయిదు జర్మను విమానములు వార్సానగరముపై 40 బాంబులను డిసంబరు 28వ తేదిని వేసెను. 21 మంది గాయములతో చచ్చిరి. కొన్ని యిండ్లకు నిప్పంటుకొనెను.

## తుర్కీ

జర్మనుల కుట్రలవలన తుర్కీ కారణము లేకుండ, యుద్ధము ప్రకటింపకుండ బ్రెస్లా, గోబెన్ యుద్ధనావలను రష్యావారి నల్లసముద్రపు రేవులమీదికిబంపి కాల్పించి యుద్ధములోనికి దిగెను. ఇంతకు ముందే తుర్కీసైన్యము నంతయు జర్మనుద్యోగీయులు తరఫీయతు చేయుచుండిరి. కాన్‌స్టాంటునోపిలును బలపఱచిరి. నౌకాశ్రయములలో దగిన యేర్పాటులను జేసిరి. గోబెన్, బ్రెస్లాలలోని జర్మనుద్యోగులను, ఫిరంగులను దీసివేసి ఆనావలను హార్బరులో గట్టివేయవలసినదనియు, బ్లాక్‌సీ రేవులమీద అకారణముగా గాల్చినందునకు సమాధాన మొసంగవలసినదనియు మిత్రమండలివారడిగిరి. తుర్కీ కొన్ని కుంటి సమాధానములను జెప్పెను. ఆలస్యము విషమగునని మిత్రమండలివారి రాయబారులు కాన్‌స్టాంటినోపిలునుండి తిరిగివచ్చుట కాజ్ఞాపింపబడిరి. తుర్కీతో దగవుకు ప్రబలమైన కారణములను జూపుచు, యుద్ధారంభమునుండియు జర్మనీవారి చేతిలోపడి ఎట్లు దుర్మార్గమునకు దిగినదియు మన రాజప్రతినిధిగారు తేటతెల్లముగా వెల్లడించిరి. మహమ్మదీయుల తీర్థప్రదేశములు మక్కా, మెదీనా మొదలగునవి ఇంగ్లీషువారిచే నతిపవిత్రముతో గాపాడబడునని తెలుపబడెను. ఇండియాలోని మహమ్మదీయులు బ్రిటిషు సింహాసనము మీద దమకుగల రాజభక్తిని దెలుపుచు వేలకొలది సభలను జేసిరి. ఇండియాలో జర్మను లనుకొనిన కుట్ర తొందరలను ముసల్మానులవలన గలుగక వారి నిరుపమాన రాజభక్తియే వెల్లడియయ్యెను. అనేకవేల మహమ్మదీయులప్పటికే పశ్చిమరంగమున బోరుచునే యుండిరిగదా! నిజాముగారును తమ రాజభక్తిని దృఢముగా వెల్లడించి, మహమ్మదీయులను, తమ ప్రజలను శాంతివహించి, రాజభక్తి కలిగియుండవలసినదని ప్రకటించిరి.

ఇంగ్లీషువారి యుద్ధనావ . మైనర్వా యనునది ఏషియాలోని అకాబా కోటలపైగాల్చి సైనికులను జంపెను. కిలోసిపాయిలు చెరువులకు నిప్పంటుకొనెను. డార్డనెల్సు జలసంధిమీద ఇంగ్లీషువారి నావలు ఫిరంగులను విడిచెను. కోటలలోని ఫిరంగులు యుద్ధనావలకు తగులునంత దూరము పారవని గానంబడెను. ఈజిప్టులో మార్షల్ లా ప్రకటింపబడెను. పాలనమంతయు సైనికాధికారుల చేతులలో నుండెను. ఈజిప్టులోని మహమ్మదీయ నాయకులందరును రాజభక్తి గలవారమని సేనానాయకులగు జనరలు మాక్సువెల్ గారి వద్దకువచ్చి చెప్పిపోయిరి. ఈజిప్టులోగాని సరిహద్దులలోగాని జరుగు యుద్ధప్రయత్నముల నింగ్లీషువారే భరించెదరనియు, ఈజిప్టు సేనలు తురుష్కులమీద పోరుటకు పిలిచికొని పోబడవనియు, ఈజిప్టియనులు శాంతము వహించి యుండిన చాలుననియు జనరలు మాక్సువెల్ గారు ప్రకటించిరి.

ఇండియానుండి అరేబియా మీదికి పంపబడిన హైందవసేన పరిష్యను గల్ఫులో షాటెలు అరబ్ నదీ ముఖమునందున్న ఫావోను బట్టుకొనెను. తరువాత బాస్రానగరము స్వాక్రమించుకొనబడినది. ఈనగరము చుట్టునున్న భూములు అత్యంత ఐశ్వర్యవంతమయినవి. అరబ్బులు తురుష్కులు అతిసాహసముతో బోరిరిగాని భారతీయులముందు చాలకపోయిరి. ఈప్రాంత్యదేశమంతయు బ్రిటిషువారి అధీనమైనదని బ్రిటిషు జనరలు ప్రకటించి, పన్నులను వసూలుచేసి దేశము నేలుచున్నారు. ఈసైన్యము షేకుసయ్యదు గ్రామమును పట్టుకొని కేపు బేబిల్ మాండేబుకు తూర్పుననున్న కోటలను వశముచేసికొనెను. డిసంబరు నెలలో టైగ్రిస్, యూఫ్రటీసునదులు సంగమించుస్థానమందున్న కుర్నా నగరమును గాచుచున్న అరబ్బులను, తురుష్కులను పారదోలి దానిని ఆంగ్లోహయిందవసేన ఆక్రమించుకొనెను.

## కియోఛా

జర్మనీవారు చీనానుండి అపహరించిన కియోఛా రాష్ట్రమును పట్టుకొనుటకయి జపానువారు పంపిన సైన్యముతో అక్టోబరు నెలలో ఇండియానుండి పంపబడిన కొంతసేనయుఁ గలిసెను. నవంబరు 2వ తేదిన తీక్ష్ణముగా సింగ్టాకోటమీఁద జపానీయులు ఫిరంగిగోళములను వదలిరి. ఇక్కట్టుకొండను చాల నష్టము కలిగెను. ముట్టడి నగరబహిర్భాగము వఱకును వచ్చెను. గుళ్లు సింగ్టా వీధులలో పడుచుండెను. కొన్ని దినము లీముట్టడి అతితీవ్రముగా జరిగెను. రాత్రింబగళ్లును జపానువారు శత్రుస్థలములను గురియించుచుండిరి. ఈ ధాటికి తాళఁజాలక నవంబరు 5వ తేదిన జర్మనులు ఉదయము ఏడు గంటలకు తెల్లబావుటా కోట కొమ్మపయి నెత్తిరి. మంగళవారము నాఁడు కోట వశము చేయునట్లు నిశ్చయింపఁబడెను. జపానుచక్రవర్తి బ్రిటిషుసైనికులకును తమ సైనికులకును సింగ్టాను పట్టుకొనినందుకయి అభినందించుచు సందేశము పంపిరి.



సింగ్టాను ముట్టడించుచున్న జపానుసైనికులు

జర్మనుఖయిదీ లిచ్చట 25,000 మంది లభించిరి. శనివారము సాయంకాలము 7½ గంటలకు జపానువారి షరతుల నన్నింటిని సంగీకరించి జర్మను సేనాధిపతి సంధికాగితముమీఁద సంతకము పెట్టెను. "యుద్ధమును చేతనయినంతవఱకు రక్షించితిని. చాకిక చేతగా నందున జపానువారివశము చేయవలసి వచ్చెను." అని కెయిజరుగారికి జర్మను జనరలు తంత్రీవార్త నిచ్చెను. సింగ్టాను జపానువారివశము చేయకముందు హార్బరులోని నావలనన్నింటిని సేనాధిపతి పాడుచేసి ముంచివేసెను. వారి కనుకూలమయిన వస్తువులనన్నింటిని కాల్చివేసెను. సింగ్టాలో జపానువారికి దొరకినవస్తువులు 2500 తుపాకులు, 100 యంత్రపు ఫిరంగులు, మూడు క్షేత్ర ఫిరంగులు, 40 మోటారు బండ్లు, 5000 మనుష్యులకు మూడు నెలలకు సరిపోవు భోజన పదార్థములు. హార్బరులోనున్న నావలన్నియు పాడుచేయఁబడినవి.

## యుద్ధస్థితి

జనవరి, ఫిబ్రవరి, మార్చి, ఏప్రిల్, మే, జూను.

వర్తమాన మహాసంగ్రామముయొక్క సాధారణస్థితి నూహించుటకైనను నలవిగాదు. యుద్ధము మూడు ఖండములందు వ్యాపించియున్నది. జర్మనీ, ఆస్ట్రియా, టర్కీ, రుష్యా, ఫ్రాన్సు, జపాను, బ్రిటీషుసామ్రాజ్యము, సర్వియా, మాంటినీగ్రో యుద్ధమునందు చేరినవి. చేరిన సైన్యములయొక్కయు చేరనున్న సైన్యముయొక్కయు సంఖ్య రెండు కోట్లను దాటవచ్చును. రెండుకోట్ల సైనికులకు కావలసిన యుద్ధోపకరణములకు, ఆహారపదార్థములకు, దుస్తులకు, వైద్యసహాయమునకు కావలసిన ద్రవ్యమును లెక్కించిన గుండెలు జల్లుమనును. అనుదినము 15,00,00,000 రూప్యములు వ్యయమగుచుండవచ్చును. యుద్ధసామగ్రులను సిద్ధముచేయుటకై లక్షలకొలది పనివాండ్రు నియమింపఁబడుచున్నారు. యంత్రశాలలన్నియు యుద్ధద్రవ్యములను నిర్మించుటకై యుపయోగింపఁబడుచున్నవి. భూమిమీఁద యుద్ధరంగములు ఫ్రాన్సు, బెల్జియము, ప్రష్యా, పోలాండు, గలీషియా, ఆస్ట్రియా, సర్వియా, కాకేషియా, పర్షియా, ఈజిప్టు, ఆఫ్రికా మొదలగు దేశములందు వ్యాపించియున్నవి. సైన్యముఖము లిన్ని దేశములందును 3,000 మైళ్లదూరము వ్యాపించియుండును.

భూమిమీఁద రంగము లింతటి విశాలమైన ప్రదేశము నాక్రమించుకొనియుండఁగ, సముద్రరంగ మింతటి ప్రదేశము నాక్రమించుకొనియున్నది, గోచరింపవలసియున్నది. ఉత్తర సముద్రము, మధ్యధరాసముద్రము మిత్రమండలి నౌకాదళముచే నాక్రమింపఁబడినది. జర్మనునౌకల రాకపోకలు బంధింపఁబడినవి. బాల్టికుసముద్రమునందు మాత్రము జర్మనునౌకల రాకపోకల కవకాశము గలదు. జర్మనుల వ్యాపారనౌకలు మాయమైనవి. యుద్ధనౌకలు కీలుకాలువ కావల దాఁగియున్నవి. యుద్ధనౌకలమీఁద 3,00,000 నావికాసైనికు లుండవచ్చును. నావికులు రేయింబవళ్లు ఏమరక యుద్ధమునకు సంసిద్ధులై యున్నారు.

భూరంగమునకును సముద్రరంగమునకును హద్దులు గలవు కాని యాకాశ రంగమునకు హద్దులు లేవు. నూరు గాలిఓడలు 2000 విమానములు ఆకసమునందు దినదినము పోరు సలుపుచున్నవి. వైమానికుల మాపు సాహసశౌర్యము లాశ్చర్యప్రదములు. యుద్ధస్థితిని గ్రహించుట కనుదినమును భూమిమీఁదను జలముమీఁదను ఆకసమునందును జరుగుచున్న యుద్ధముల ఫలమును గ్రహింపవలయును.

THE CHARGE OF THE BENGAL LANCERS AGAINST THE GERMANS



బెంగాలు లాంసరులు జర్మనులపైకి ఉరుకుట

CHARGING ON FOOT WITH THE LANCE



జర్మను కందకములను బెంగాలు లాంసరులు పట్టుకొన బోవుట

FIELD MARSHAL VON DER GOLTZ



జర్మనుఫీల్డుమార్షల్ వాన్ డర్ గోల్జు. తుర్కీ సర్వసేనాధిపతి

THE EX KHEDIVE OF EGYPT



పదభ్రష్టుడయిన ఈజిప్టు పాలకుడు

SULTAN HUSSAIN



ప్రస్తుత ఈజిప్టు పాలకుడు, సుల్తాన్ హుస్సేన్

BIKANER CAME



ఈ జేపు పరిపాడులలో బికనీరు

HAND TO HAND FIGHT



ఒక హైందవ సైనికుడు శత్రువును లాట్టీపిటతో చంపివేయుట

ఈ దారుణ సంగ్రామమునం దొక్కటి ఫలమును ప్రయోజనమును నిర్ణయించుట దుస్తరము.

జయాపజయములు సైన్యబలమును నౌకాబలమును విమానబలమును ననుసరించియే కాక ముఖ్యముగ ద్రవ్యబలము ననుసరించి యుండును. యుద్ధస్థితిని నిర్ణయించుటకుఁగాను సైన్యబలమును, నౌకాబలమును, విమానబలమును, ద్రవ్యబలమును, ధర్మబలమును మూడు ఖండములందుఁగల రంగములకు సమన్వయము చేయవలయును. ప్రతిభావంతులైన సేనాధ్యక్షులకు సయితము విది యలవిగాని పని యని గ్రహించినపుడు సామాన్యులమాట వేఱుగ చెప్పవలసిన పని లేదు. ధీమంతులు సకల బలములను సమన్వయము చేసి యుద్ధస్థితిని నిర్ణయింపవలసి యుండును. యుద్ధవార్తలందు మనము ప్రతిదినము చదివెడి జయాపజయముల వార్తలవలన యుద్ధస్థితిని గ్రహించుటకు వీలుండును కాని యుద్ధఫలమును నిర్ణయించుటకు వీలుండదు. యుద్ధఫలమును ప్రస్థానక్రమముయొక్క సకలమైన సాధక బాధకములను సమన్వయము చేసి నిరూపించుట ప్రయోజనకరము.



ఈగురు బ్రిటిషు సైనికులు జర్మను కందకములో ప్రవేశించుట [illegible]

## జర్మనులతంత్రము

జర్మనుల యుద్ధప్రస్థానక్రమము మొదట ఫ్రాన్సును పిమ్మట రుష్యాను తదనంతర మింగ్లాండును నోడించుట యనియు నీ పని యతిశీఘ్రముగ ముగియవలయు ననియు జర్మను యుద్ధతంత్రజ్ఞుఁడు బర్న్‌హార్డి గారు రచియించిన గ్రంథమునందు వివరముగ తెలుపఁబడినది. ఆ వ్యూహమునందు జర్మనుల మనోరథములు విఫలములైన వని ధ్రువపడినవి. జర్మనీ బెల్జియమును నోడించి యా దేశము నాక్రమించుకొనినది. ఫ్రాన్సునందును రుష్యాయందును కొంతభాగము నాక్రమించుకొనఁజాలినది. కాని ఫ్రాన్సు, రుష్యా, ఇంగ్లాండులను నోడింపఁజాలకున్నది. జర్మనులు తమ మొదటి సంకల్పము నెఱవేఱదని గ్రహించినపుడు క్రొత్త వ్యూహమును పన్న నారంభించిరి. యుద్ధ మంతయు శత్రువుల దేశములందు జరుగవలయు ననియు జర్మను దేశము యుద్ధోపద్రవమునకు లోను గాకుండవలయు ననియు జర్మనులు తలపెట్టిరి. ఈ పద్ధతి నవలంబించుటవలన జర్మనులకు యుద్ధము చిరకాలము చేయుట కవకాశము కలుగును. జర్మను దేశమునందు యథాప్రకారము పంటలు పరిశ్రమలు సాగుటకు వీలుండును. అన్ని ప్రక్కలను జర్మనికి గమనాగమన మార్గములు బంధింపఁబడినవి. దీనికి తోడు యుద్ధము జర్మను భూములందు జరిగిన జర్మనులు బ్రతుకుటకు వెరవు లేకుండును. జర్మను లీరహస్యమును గ్రహించి తమ భూమిని యుద్ధోపద్రవమునుండి కాపాడుటకై విశేషమైన నష్టమును భరించుచున్నారు. జర్మనులు శత్రువుల దేశములందు కందకములను త్రవ్వి స్థిరవాసములను నిర్మించి శత్రువు లాకస్మికముగ మీఁద పడకుండుటకు తగిన సదుపాయములను కల్పించి సమయము దొరికినపుడు శత్రువులమీఁద పడుచున్నారు. కాలహరణము గావించుట జర్మనుల యుద్ధతంత్రమునందు మొదటి యంతరము. తప్పనిసరిగ కాలహరణమైనపుడు యుద్ధములను శత్రువుల దేశములందు చేయుట రెండవ యంతరము.

## మిత్రమండలి యుద్ధతంత్రము

మిత్రమండలి యుద్ధతంత్రములో మొదటి యంతరము శత్రువులను తమ దేశమునుండి వెడలఁగొట్టుటయు నది సాధ్యము గానపుడు కాలహరణము చేయుటయునై యున్నది. జర్మనులు తమ పూనికను నెగ్గించుటకు పూర్వరంగమునుండి పడమటిరంగమునకును పడమటిరంగమునుండి పూర్వరంగమునకును నవసరమునుబట్టి మాఱుచుందురు. మిత్రమండలివారు జర్మనుల పూనికను పాడుచేయుటకై పూర్వరంగమునందును పడమటిరంగమునందును జర్మనుల సైన్యమును పెడత్రోవలు పట్టించుచుందురు. మిత్రమండలి నిష్కారణముగ సైన్య వినాశనమున కంగీకరింపదు. ఈ విషయమును గమనించినవారల కుభయపక్షముల సైన్యములు ముందునకు వెనుకకు పోవుటకుఁగల కారణంబులు విదితములు. ఆకారణంబుల నరయుచు యుద్ధప్రస్థాన క్రమం

బును విలోకించినచో నుభయపక్షముల జయాపజయములు, బలదౌర్బల్యములు, లాభనష్టములు సుబోధ్యము లగుచున్నవి.

## ముట్టడి యుద్ధము

మిత్రమండలి సైన్యములు ఫ్రాన్సు బెల్జియము దేశములలోని కొన్ని ప్రదేశములందు జర్మను సైన్యములను కొన్ని వందల గజములు ముందునకు నెట్టిన వనియును, మరికొన్ని ప్రదేశములందు జర్మను సైన్యములు మిత్రమండలి సైన్యములను వెనుకకు నెట్టిన వనియును వార్తల సారాంశమై యున్నది. కాని పడమటి రంగమునందు ముఖ్యముగ గమనింపదగిన విషయ మొకటి గలదు. ఆల్సేసునందు ఫ్రెంచి సైన్యములు క్రమక్రమముగ చొరఁబడుచున్నవి. ఆ మార్గముననె ఫ్రెంచి సైన్య నివహములు జర్మను దేశమునందు చొరఁబడు వనియును జర్మను



గాయపడిన ఫ్రెంచి సైనికుని హైందవ సైనికుండు శిబిరమునకు తీసికొనిపోవుట

సామ్రాజ్యాంతర్భాగమైన బవేరియాయందు కలవరము గలుగుచున్నటులను వదంతి. జర్మనులు మిత్రమండలి సైన్యములను కలై, ఈప్రెస్, సిసోన్సు మార్గములనుండి గాక ఫ్రాన్సు దేశమునందలి ఆగ్నేయ దిశనుండి ఛేదింపఁ బ్రయత్నించుటకై 20,00,000 సైన్యనివహంబుల నాయత్తపఱచుచున్నటులు యుద్ధక్షేత్రజ్ఞు లూహించుచున్నారు.

## రష్యనులు వెనుకకు మరలుట

పడమటి రంగపు స్థితి యిటు లుండఁగా, తూర్పు రంగపు స్థితియును సందిగ్ధముగ నున్నటు లూహింపదగియున్నది. తూర్పు ప్రష్యాయందు రష్యనుల పురోగమనమునకు జర్మను సైన్యములవలన నిరోధ మేర్పడినటులు రష్యనుల ప్రకటనలవలన స్పష్ట మగుచున్నది. టిల్సిటువఱకు పోయిన రష్యను సైన్యములు విపులములైన జర్మను సైన్యనివహముల యొత్తిడివలన వెనుకకు తగ్గుచున్నటులు తెలియుచున్నది. జర్మను చక్రవర్తి సేనాధ్యక్షుండు హిండెనుబర్గు ఇణ్‌స్టర్‌బర్గునందుఁ గూడి యుద్ధప్రస్థానక్రమమును యోచించునటులు తెలియుచున్నది. తూర్పు ప్రష్యా ప్రాంతములందు రష్యనులు యుద్ధారంభమునందువలె వెనుకకు పడవలసివచ్చునటులు తోఁచుచున్నది. పోలాండునందు జర్మను రష్యను సైన్యము లెప్పటి స్థితియందు యున్నవి.

## గలీషియాయందు రష్యనుల గెలుపు

కార్పేతియను కనుమలందు రష్యనులకు విజయమును నాస్ట్రియనులకు పరాజయమును గలుగుచున్నవి. తూర్పురంగమునందు పదునైదు దినములలో 40,000 మంది జర్మను ఆస్ట్రియను సైనికులు నిహతు లైనటులు దృష్టాంతము గలదు. తురుష్కులు ఆర్మీనియా, పర్షియా, సూయజు ప్రాంతములందు పరాజితు లగుచున్నటులు వార్తలవలన తెలియుచున్నది. నల్ల సముద్రమునందును డార్డనెల్సునందును మిత్రమండలి యుద్ధనౌకలు తురుష్కుల నావలను సైన్యములను పదార్థములను నాశనము చేయుచున్నటులు తెలియుచున్నది. ఆఫ్రికాయందు రాజద్రోహులు వశులైరి. జర్మనుల దేశమునందు ఆంగ్ల సైనికులు చొరఁబడుచున్నారు. సర్వియనుల వృత్తాంత మిటీవల నేమియు వినవచ్చుట లేదు. మొత్తముమీద యుద్ధ ప్రస్థాన క్రమము భూమియందు మిత్రమండలి కనుకూలముగ నున్నదని గ్రాహ్యమగుచున్నది. ముట్టడి యుద్ధ మారంభమైన తరువాత యుద్ధ ప్రస్థాన క్రమమునందు నూతన విధాన మేర్పడినది. విచిత్రములైన వ్యూహములను పన్నుటకుఁ గాని గొప్ప విజయములను పొందుటకుఁ గాని యవకాశములు తగ్గినవి. ఉభయ పక్షముల సైన్యము లొండొరులను మార్కొనుటకు కందకములు నడుమ నున్నవి. గుండ్లవానతో కందకములను నాశనము చేసినఁ గాని సైన్యనివహంబులకొక గజమైనను ముందునకు పోవుటకు వీలు గలుగుట లేదు. అందువలననె యీ యుద్ధము ముట్టడి యుద్ధముగ పరిణమించుచున్నది.

## ఫ్రాన్సు

ఫ్రెంచి సేనాధ్యక్షుండు జోఫ్రే మార్ని యుద్ధము ముగిసిన తరువాత సైన్య నివహంబులను సిద్ధము చేయుచుండెను. జనవరి మొదట మ్యూజునదీతీరమునం దున్న స్టీణ్‌బాచియొద్ద గుండ్లవానను కురిపించి జర్మనులను పరాసు లోడించిరి. జనవరియం దంతటను సిసోన్సువద్దను ఈప్రెసువద్దను నుభయ పక్షముల సైన్యములు ముందు వెనుకలకు పోవుచుండినవి. జర్మను చక్రవర్తి రణరంగమునకు స్వయముగ 17వ తేదిని వచ్చియుండెను. సిసోన్సువద్ద జర్మనులు 1,000 మంది పరాసు సైనికులను పట్టుకొనిరి. వానలు కురి

ఆష్ట్రియనులు సర్వియా రాజధాని యైన బెల్‌గ్రేడును నిప్పుగుండ్లతో కాల్చిరి. సర్వియనులు సెమిలినును కాల్చిరి.

## రుష్యను సైన్యముల విధి

తూర్పు రంగమునందు రుష్యనులు నెఱవేర్చవలసిన యుద్ధతంత్రము పడమటి రంగమునందలి జర్మనుల యొత్తిడిని తగ్గించుటయై యున్నది. ఆ భారమును నిర్వహించుటకు రుష్యను బలములు చాలియున్నవి. సంఖ్యయందు రుష్యను బలములు జర్మను బలములతో తులతూఁగఁగలవు. కాని యుద్ధసన్నాహములందు తులఁదూఁగఁజాలవు. ఆంగ్ల ఫ్రెంచి సైన్యములు యుద్ధోపకరణములందు సమానత్వము వహించినను, సంఖ్యలయందు సమానత్వము వహింపఁజాలవు. జర్మను యుద్ధతంత్రజ్ఞుల కీవిషయము తెలిసియున్నది. కావుననే వారు తూర్పు సరిహద్దునుండి పడమటికిని పడమటి సరిహద్దునుండి తూర్పునకును నతిశీఘ్రముగ సైన్యనివహంబులను కొనిపోవుటకు చాలిన రైలు మార్గములను దేశమునం దంతటను వలవలె నిర్మించిరి. ఇందువలన నవసరమును బట్టి 20 లక్షల మంది సైనికులు తూర్పునుండి పడమటకు పడమటనుండి తూర్పునకు యుద్ధ మారంభ మైన పిమ్మట రెండు మూడు సారులు మార్చఁబడిరి. పడమట జర్మనుల యొత్తిడిని తగ్గించుటకై రుష్యనులు తూర్పు ప్రష్యాయందును దక్షిణమున హంగరీయందును కార్పాతునందును ప్రవేశించిరి. ఈ వ్యూహమునకు ప్రతివ్యూహముగ రుష్యన్ పోలండునందు జర్మను సైన్యములు స్థిరముగ నిలిచినవి. పోలాండు ప్రష్యకును గలీషియాకును నడుమ నున్నది. పోలాండులోని జర్మను సైన్యములు క్రొత్త సైన్యముల చేరికవలన బలవత్తరము లై యుత్తరమున ప్రష్యకును దక్షిణమున గలీషియాకును వ్యాపించి రుష్యనుల యుద్ధప్రస్థానమునకు విఘ్నము కల్పింపఁగలవు.

## పోలాండు ప్రస్థానము

వర్షాకాలమునందును శీతకాలమునందును తూర్పురంగమున మార్గములు బురదతో నిండియుండుటవలన విశేషసంఖ్యాకంబు లైన సైన్యనివహంబులు నడచుటకు వీలు లేదు. చైత్ర మాసాంతరము వీలు కలదు. ఆ సదుపాయమును బట్టి రుష్యనులు మార్చి యేప్రిలు మాసములలో తూర్పు ప్రష్యాయందును గలీషియాయందును చొఱబడ నారంభించిరి. మార్చి మొదటి భాగమున రుష్యనులు పోలాండునందు ప్రాస్నిష్ మ్లావా ప్రాంతములందు గెలుపొంది జర్మను ఖైదీలను యుద్ధసామగ్రిని పట్టుకొనిరి. పోలాండులో నీయుద ప్రాంతములందు జయాపజయములు రెంటికిని సమానముగ నున్న దని చెప్పవచ్చును. జూను నెల యారంభమునుండియు యుద్ధప్రస్థానము జర్మనుల కనుకూలముగ నున్నట్లు వార్తలవలన తెలియుచున్నది. జర్మనులు పడమటి రంగమునుండి తూర్పురంగమునకు 20 లక్షల మంది సైనికులను మార్చుటయే యీ యనుకూల్యమునకు కారణము.

## ఆష్ట్రియనుల దుర్గతి

గలీషియా యుద్ధరంగము మెయి చివరవఱకు రుష్యనుల కత్యంతానుకూలముగ నున్నది. ఆష్ట్రియాకు చెందిన గలీషియా రుష్యాకు దక్షిణమునం దున్నది. ఆ దేశము నడుమ కార్పేథియను పర్వతములు గలవు. ఆ పర్వతములను దాటినపుడు హంగరీ దేశము స్వాధీనము కాఁగలదు. ఆ కొండల కుత్తరమున సురక్షితము లైన లెంబర్గ్ క్రాకో ప్రెమిస్లి కోటలు గలవు. కొండలందు కూడ సురక్షితము లైన కనుమలు గలవు. రుష్యనులు కోటలను కనుమలను స్వాధీనము చేసికొనిన గాని హంగరీలో చొఱబడుట సాధ్యము కాదు. ప్రెమిస్లి ముట్టడిని రుష్యనులు యుద్ధారంభమునం దారంభించిరి. మార్చి 23 వ తేదిని పట్టణము రుష్యనులకు లోఁబడినది. లక్షమంది ఖయిదీలు ఫిరంగులు విశేషమైన యుద్ధద్రవ్యములు రుష్యనులకు దక్కినవి. మార్చి 25వ తేదిని హంగరీయందలి స్ట్రోస్టినయొద్ద రుష్యనులు గెలిచిరి. కార్పేథియనులలోని దూక్లా, ఉస్జోకు, లుప్కౌ మొదలగు కనుమలు రుష్యనుల వశ మైనవి. ఏప్రిలు మాసమునందు రుష్యనులు తిరిగి యాష్ట్రియనుల నోడించి హంగరీదండయాత్ర కుపక్రమించిరి. హంగేరియనులు భయకంపితులై వెనుకకు మరలిరి. జర్మనులు వెంటనే సహాయము చేయకున్న, వారు సంధిచేసికొనెద రను వదంతి కలిగినది. వియన్న బర్లిను నగరములందు విభ్రాంతి కలిగినది. రుష్యా చక్రవర్తి గలీషియాకు వచ్చి సేనానాయకులను సైనికులను సంస్తుతించి వారిని సన్మానించెను. మెయి నెల మధ్యభాగముదనుక రుష్యనుల విజయయాత్ర కడ్డు లేకుండెను.

## జర్మనుల నూతనప్రస్థానము

అపుడు జర్మను యుద్ధమంత్రులు కార్యాలోచన కుపక్రమించిరి; పడమటి రంగమునుండి సైన్యములను తూర్పు రంగమునకు మార్చిరి. ముప్పది లక్షల సైనికులను, అమిత మైన యుద్ధసామగ్రిని, మహత్తరము లైన శతఘ్నులను జర్మనులు తూర్పురంగమునందు ప్రవేశ పెట్టిరి.



గలీషియాలో శత్రుసైనికు లొకరి నొకరు నరుకుకొనుచున్నారు

మైనది. లిల్లీకి నెక్కు రైలు మార్గములు వాటులు గలవు. దాని యాక్రమణమువలన జర్మనుల కనేకసదుపాయములు కలిగినవి. మిత్రమండలికిని కలుగగలవు. సర్ జాన్ ఫ్రెంచి లిల్లీ నాక్రమించుటకై ప్రయత్నించెను. ఈసమ కాలములో నారంభమైన ప్రస్థానక్రమము న్యూషాపలెలో నంతము నొందినది. న్యూషాపలెయుద్ధ మిత్రమండలికి విజయము కలిగినను, జర్మనుల దూరదృష్టివలనను సేనానాయకుని విలంబమువలనను లిల్లీ పట్టుపడలేదు. ఈసను, న్యూషాపలె, 60వ నెంబరు కొండ, ఓప్రూమాండు మొదలగు ప్రదేశములందు ముట్టడి యుద్ధములు జరిగినవి. బెల్జియను లాంగ్లేయుల కీ యుద్ధములందు తోడ్పడుచుండిరి.



కందకములయందుండి మిత్రునకు వ్రాయుట

## పరాసులు మెల్లగా ముందునకు పోవుట

ఫ్రెంచివారు అర్రాసు, షాంపెయిను, అర్గాయిన్, అల్సేసు, లోరెయిన్, వాస్జెసు, సెయింటు మార్బి మొదలగు ప్రదేశములందు క్రమ క్రమముగ విజయములను పొందుచుండిరి. ఫ్రెంచి సేనాధ్యక్షుఁడు జోఫర యుద్ధతంత్రజ్ఞుఁడు. ఆయన వర్తమాన సంగ్రామము నందు క్రొత్త యెత్తు నెత్తెను. ఆయన యనవసరముగ తన సైనికుల నాశనమున కొప్పుకోనడు; నెమ్మదిగ శత్రుసైన్యమును నాశనము చేయుటకు యత్నించును. ఈ యుద్ధతంత్రము ఫ్రాన్సును రక్షించినది. గంటకు రెండు లక్షల షెల్లుల వంతున ప్రయోగించెడి సామర్థ్యము కలుగనంతవఱకు శత్రు సైన్యముపైఁ బడుట కవకాశము లేదని జోఫర మతము. ఫ్రాన్సుదేశమునుండి జర్మనులు నెమ్మదిగ నెట్టఁబడుచున్నారు. అల్సేసు లోరెయిను ప్రాంతములందు పరాసులు నెమ్మదిగ జర్మను దేశములో చొఱఁబడుచున్నారు. జర్మనులు తిరిగి కలెయి మార్గమున ప్యారిసును సమీపించుటకు యత్నించి విఫలమనోరథులైరి. ఆ సమయమునందు జర్మను చక్రవర్తి స్వయముగ నాయకత్వము వహించి సేనలను విజయమునకు పురికొలిపెను. మే జూన్ మాసములందు హంగరీదేశమునకు సిద్ధముగ నున్న ముప్పును తప్పించుటకై జర్మను బలములలో విశేష భాగము పడమటి రంగమునుండి తూర్పురంగమునకు మరల్పఁబడినవి. ఆ మార్పువలన ఫ్రాన్సునందు జర్మను సైన్యములకు బలము తగ్గి పరాజయమును, తూర్పు రంగమునందు బలము హెచ్చి విజయమును కలిగినవి. జూను మాస మంతమువఱకును పడమటి రంగమునందలి కందకములను స్వాధీనపఱచుకొని ముందునకు మెల్లగా పోవుటయే మిత్రమండలి ప్రస్థానక్రమమై యున్నది.



బ్రిటిషు సైనికులు జర్మను కందకములో చేసిన పని

## తుర్కీ

### రుష్యనుల విజయము

కాకసను ప్రాంతములందలి కెర్మ్యాయి సరిక్యామిష అర్ధహేము గ్రామములను రుష్యనులు వశపఱచుకొని 41,800 మంది ఖైదీలను ఫిరంగులను పట్టుకొనిరి. కార్గ్నాను ఎనికపై అర్దనేసుల దగ్గఱ రుష్యనులు సంపూర్ణముగ తురుష్కుల నోడించిరి. వీనయి యొద్ద తురుష్కు లోడింపఁబడిరి. టాబ్రిజే నాంగ్లసేనలు వశపఱచుకొనినవి. ముష్కతు మకేరావద్ద బ్రిటిషు సైనికులు తురుష్కుల నోడించిరి. పోర్షింజి ప్రభువు పారసీక సంయుక్తాగ్రగుడమునకు హోయి బసారి నోమెర కొందలగు స్థలములను సందర్శించెను. రుష్యనులు త్రెబిజాండును వశపఱచుకొనిరి. డార్డినెల్సు జలసంధిని వశపఱచుకొని కాన్‌స్టాంటినోపిలును స్వాధీనపఱచుకొనుటకై మిత్రమండలి ప్రయత్నించుచున్నది. అచ్చటి మందుగుండులు తీసి వేయఁబడుచున్నవి.




### డార్డినెల్సు ముట్టడి

తుర్కీ దండయాత్రయందు మంచి ప్రయోజనము కలదు. తురుష్కుల రాజధానియైన కాన్‌స్టాంటినోపిలును ముట్టడించుటకై మిత్రమండలి చేయు ప్రయత్నము తురుష్కుల సైన్యమును సూయజు ప్రాంతమునుండియు ఆసియాభాగములనుండియు స్వదేశసంరక్షణార్థమై మరలుచున్నది. తురుష్కుల సహాయమునకై జర్మను సైన్యమునందు విభాగ మేర్పడుచున్నది. డార్డినెల్సు జలసంధియు బాస్ఫరసు జలసంధియు స్వాధీన మైనప్పుడు రుష్యా దేశపు సంపదలు వెలువడుటకును రుష్యాకు యుద్ధసామగ్రి శీఘ్రముగ చేరుటకును వీ లేర్పడును. అన్ని కారణములకంటె ముఖ్య మైనది బాల్కను రాష్ట్రములందు మిత్రమండలి ప్రతిభ హెచ్చి సంశయావస్థయందున్న బాల్కను రాజ్యములు మిత్రమండలి పక్షమున చేరవచ్చును. ఈ కార్యసిద్ధికై నల్లసముద్రమునుండి రుష్యనులును డార్డనెల్సునుండి యాంగ్ల ఫ్రెంచి సైన్యములును ప్రయత్నించుచున్నారు.

మార్చియం దాంగ్ల ఫ్రెంచి నౌకలు డార్డినెల్సునుండి విస్ఫోటగుండ్లను ప్రయోగింప నారంభించినవి. ఎలిజబెత్తు యుద్ధనౌకనుండి పెద్ద షెల్లులు డార్డనెల్సు ముఖద్వారమునం దున్న కిల్లబహారు, కాంకతేసి, సుల్తాను, మెజ్దీ, కోకి, నగర కోటలపై ప్రయోగింపఁబడి కోటలు నాశనము చేయఁబడినవి. ఆంగ్ల జలాంతర్గాములు యుద్ధనౌకలు డార్డనెల్సునందు చొఱఁబడి తురుష్కులకు భయము పుట్టించినవి. మెయి నెల మొదటి వారమునందు బ్రిటీషు సైన్యములు గ్యాలిపోలియందును ఫ్రెంచి సైన్యములు లాప్సాకియందును దిగి తురుష్కులను పారఁద్రోల నారంభించినవి. రుష్యా యుద్ధనౌకలు బాస్ఫరసు ప్రాంతములందు నష్టము కలిగించినవి. మెయి చివర నను లు తగిలి యాంగ్ల యుద్ధనౌకలు ట్రయంఫు మెజెస్టిక డార్డనెల్సునందు మునిఁగిపోయినవి. ఇపుడు తిరిగి డార్డనెల్సుముట్టడి మెల్ల మెల్లగ సాగుచున్నది.

## కాకేససు యుద్ధము

కాకేససు ప్రాంతములం దేప్రిలు మేయి నెలలలో తురుష్కులు పరాజితులైరి. ఈజిప్టునందును తురుష్కుల కపజయము గలిగినది. సూయజుకాలువను రక్షించుటకై మొరటెలపటాలము నాంగ్లేయులు నియమించిరి. సర్ ఇయన్ హేమిల్టను మధ్యధరా సముద్రములోని యాంగ్ల సైన్యమునకు సేనాధ్యక్షుడుగ నియమింపబడెను. ఆయన నాయకత్వము క్రింద డార్డనెల్సు యుద్ధప్రస్తావము త్వరగా ముగియగల దని విశ్వసింపబడుచున్నది. తురుష్కులు మెసపొటేమియా సూయజు ప్రాంతములందును నోడింపబడిరి. మిత్రమండలి సైన్యము స్మర్నాను ముట్టడించినది. సాహెబామండి తురుష్కులు వెడలగొట్టబడిరి.

## సముద్రరంగము

జర్మనుల పరాభవమున కాంగ్లేయులు పన్నిన నౌకావ్యూహము ప్రశస్తము. ఆంగ్లనౌకాదళము జర్మనుల వ్యాపార నౌకాదళమును పారుచేసి వారి దేశమునకు రాకపోకలను బంధించినది. ఆవ్యూహము జర్మనుల కాగ్రహమును కలిగించినది. అన్ని రోడ్లను విడువక లేక యుండుటకు జర్మనులు ఫిబ్రవరి నెలలో సిద్ధపడిరి. జనవరి ఫిబ్రవరులందు ముంచబడిన మిత్రమండలివారి నౌకల వివరము:—ఫోర్మిడేబులు (యుద్ధనౌక) మునిగినపుడు 517 గురు నావికులు మృతినొందిరి; మిత్రమండలివారి నాలుగు పొగనోడలను క్రోక్ ప్రింజెవిల్ హెల్మ్ ముంచినది; ౧౦ డార్గస్ట్రీమరులు, ఒక ట్రాలరు, ఒక ఫ్రెంచి జలాంతర్గామిని, దర్వార్డు స్టీమరు ముంచివేయబడినవి. వింకాస మునుగుటవలన 270 మంది మృతి నొందిరి. సుదాంగ్లాంచి, ఫాక్రుతలజ్, టోకోమారు, వైద్యనౌక అస్ట్రియస్, ఇకారియక్, డల్విచి, కాంబాంక్, డికోరా, ఎంటుస, ఫ్రాక్స ముడైక్, రిరొముపార్నా, వార్వాలిక్, ఓక్బీ, కాక్‌మార్నాటన, కరబ ముంచివేయబడినవి.

డార్డనెల్సునందును నల్లసముద్రమునందును కొన్ని తురుష్కనౌకలు, బాల్టికునందు రెండు జర్మను స్టీమరులు, ఉత్తరసముద్రమునందు కొన్ని జర్మను స్టీమరులు ముంచబడినవి.



THE DARDANELLES



డార్డెనల్సు జలసంధిమార్గమున మిత్రమండలివారి యుద్ధనావలు బంధించుట.

A DREADNAUGHT



డార్డెనల్సులో యుద్ధము చేయుచున్న ఒక డ్రెడ్నాటు, అందలి భాగముల వివరము.

THE GUNS OF THE "QUEEN ELIZABETH" IN ACTION



క్వీను ఎలిజబెత్తు యుద్ధవాడనుండి ఫిరంగులు శత్రువాడలమీద డార్డనెల్సులో 20 మైళ్ల దూరమునకు కాల్చబడుట

DISTANCE COVERED BY THE MODERN NAVAL GUNS




డార్డనెల్సులో బ్రిటిషువారి యుద్ధవాడనుండి కాల్చిన 12 యించి ఫిరంగిగుండ్లు 22,500 అడుగుల యెత్తున కేగి
15 మైళ్లదూరములో సైనికుల నెక్కించుకొని పోవుచున్న తుర్కీ-వారివాడమీద పడుట



LORD HALDANE

హాల్డేను ప్రభువు



MR. L. HARCOURT

లూయి హార్కోర్టు



LORD GLADSTONE

గ్లాడ్స్టను ప్రభువు. దక్షిణాఫ్రికా గవర్నరు జనరలుగా నుండెను



MR. JOHN REDMOND

మిస్. జాన్. రెడ్మండు. ఐరిషు నాయకుడు



LUSITANIA

లూసిటేనియా



HARBOUR DEFENCE AGAINST SUBMARINES

సబ్మెరయినుల నుండి హార్బరుల కాపాడు పద్ధతి

హార్బరులలోని యుద్ధనావలను గాపాడుటకయి అనేకమందు గనులు పెట్టబడియున్నట్లు ఈ పటమువలన తెలియవగును. వీనికి తగిలినను సబ్మెరయిను నాశనమగును. హార్బరు ద్వారములందు ఉక్కు స్తంభములు దించబడి వాని చుట్టును తెగని యినుపవలలు నీళ్లలో కట్టబడును. సబ్మెరయిను వలలలో చిక్కుకొనును. ఇట్టిసంరక్షణములవలన యుద్ధనావ లుండు హార్బరులకు సబ్మెరయినుల భీతిలేదు.

నది. రెండు యుద్ధములందును నష్ట మధికముగ జర్మనులకే కలిగిన దని తెలియుచున్నది. జర్మనులు తా మవలంబించిన మార్గమునుబట్టి యనేక వ్యాపారనౌకలను ముంచిరి.

## జర్మనులుముంచిన నౌకలు

సిటి ఆఫ్ కేంబ్రిడ్జి, క్రౌన్ ఆఫ్ కాష్టయిలు, హెలెన్ కిజ్, ఎమ్మా, పౌలుపాయింటు, లాన్సడను, డేరా, పియర్మెంటు, ఎలిస్ ఫెంటినసు, ఉవిల్లా, గ్లాండియా, రూతు, ఈడేలు, గల్ షైటు, లూసిటానియా, గోలియతు, ట్రయంఫు, కొన్ని నార్వే, పోర్చుగీసు, స్వీడను, డచ్చి స్టీమరులు, కొన్ని ట్రాలరులు జర్మనులచే ముంచబడినవి.

## మిత్రమండలిముంచిన నౌకలు

మిత్రమండలివారు జర్మనుల డ్రెస్డెను, కారల్ ప్రూహి, ష్ట్రాసుబర్గ, డ్యూచిలాండు మొదలగు యుద్ధనౌకలను, ఏడెనిమిది జలాంతర్గాములను, కొన్ని టార్పిడోబోట్లను, కొన్ని వ్యాపారనౌకలను ముంచిరి. మరియును నల్లసముద్రమునందును, మార్మొరా సముద్రమునందును తురుష్కుల నౌక లనేకములు మిత్రమండలిచే నాశనము చేయబడినవి.



ఒక జర్మను విమానము బ్రిటిషు నావపయి బాంబులు వేయుట

## జర్మనులనౌకా వరోధఫలము

జర్మనుల నౌకావరోధపద్ధతివలన తటస్థరాజ్యముల ప్రజలకును వ్యాపారమునకును నష్టము కలుగుచున్నది. నిరపరాధులు జర్మనుల దౌర్జన్యమువలన పడిపోవుచున్నారు. అమెరికా ప్రభుత్వమువారు జర్మనుల పద్ధతిని నిందించిరి, ఆగ్రహపరవశులైరి. కాని యింతవఱకును జర్మనులు ప్రతీకారమును కల్పింపలేదు. జర్మను లవలంబించిన నౌకావరోధపద్ధతివలన నాంగ్లవ్యాపారమునకు విశేషమైన నష్టము కలుగలే దని వార్తలవలన తెలియుచున్నది. ఆంగ్ల నౌకావ్యూహము మహత్తరముగ జర్మనులను బాధించుచున్నది. ఆంగ్ల నౌకాధికారులు జర్మనుల దుర్నయములకు చలింపక తమ వ్యూహమును నిర్విఘ్నముగ నడపుచున్నారు. యుద్ధఫల నిర్ణయ మాంగ్లనౌకాదళ వ్యూహమువలననే తేలు నని యుద్ధతంత్రజ్ఞులకు దృఢ నిశ్చయము గలదు.

## ఆకాశరంగము

భూరంగమునందు జర్మనుల బలము మొదట హెచ్చుగ నున్నను, కాలక్రమమున మిత్రమండలి బలము కూడ హెచ్చుచున్నది. జలరంగమునందు బ్రిటీషు నౌకాబలమును జర్మనుల నౌకాబలము మించుట దుర్లభము. ఆకాశరంగమునందు రెండు పక్షముల బలాబలములను నిర్ణయించుట దుస్తరము. జర్మనులకు జెప్లినులందు నమ్మకము గలదు ఫ్రెంచివారికి విమానములయందు విశ్వాసము గలదు. ఆంగ్లేయులకు రెంటియందును సమానాదరణముగలదు. ఆకాశయానములను గురించి ప్రకటించిన వ్యాసమును చదివియున్న పాఠకమహాశయులకు వాని గుణాగుణములు బోధపడ గలవు. కాని జెప్లినులును విమానములును నూతననిర్మాణము లగుటంజేసియు, యంత్రనిర్మాణములందు లోపము లుండుటవలనను వాని ప్రయోజనమును బలమును చక్కగ నిర్ణయించుట సాధ్యము కాదు. జెపెలిను లాకృతి యందు పెద్దవైనను, నుపయోగమునందు విమానలకు సాటిరావని వర్తమానసంగ్రామమునందు ఋజువగుచున్నది. మొత్తమున నాకాశరంగబలమునందును మిత్రమండలి పక్షము జర్మనులకంటె తీసిపోవ దని జరిగిన విషయములను బట్టి నిర్ణయింపవచ్చును. జనవరి ఫిబ్రవరి మాసములం దాకాశరంగమున నడచిన విషయము లీ క్రింద వివరింపబడినవి.

## జర్మను వైమానికులు దుండగములు

జనవరి మొదట జర్మనులు జెప్లినులనుండి నిప్పుగుండ్లను కలేయి డంకర్కు నాన్సి పట్టణములమీద ప్రయోగించి జననష్టమును కలిగించిరి. ఈ నెల 16వ తేదిని జర్మను విమానము తుపాకితో కాల్పబడినది. 20వ తేదిని ఫ్రాంసెయిను ప్రాంతమున నలువురు వైమానికులు పట్టుబడిరి; జర్మనులు 21వ తేదిని నార్ఫోకు మండలమునందలి యార్మతుమీదను 23వ తేదిని ఏయిటూపులుమీదను నిప్పుగుండ్లను ప్రయోగించిరి; రుష్యాలోని లీబామీద కూడ బాంబులను వేసిరి కాని, రుష్యనులు విమానమును తుపాకులతో కాల్చి




సేనాధిపతి బోథా ఆఫ్రికాయందు జర్మనుల నోడించెను. దక్షిణ పశ్చిమ ఆఫ్రికాలలోని జర్మనులు గ్రూటుఫాంటేను తరలి పోయిరి. దక్షిణాఫ్రికా సైన్యములు వాల్విసును, కాల్కు-ఫాంటేను, ఉసువాకును పట్టుకొనెను. క్రమక్రమముగ నాఫ్రికాలోని జర్మనుదేశ మంతయు మిత్రమండలికి వశమగుచున్నది.

# కోటలు కందకములు మొదలైనవి

## కోటలు



జర్మనుల దిగ్విజయయాత్రకు బెల్జియనులు లీజి నామూరు కోటల యాధారమువలన సైంధవునివలె నడ్డపడి ఫ్రెంచి సైన్యము కూడుట కవకాశము కల్పించి వారికి చేసిన సహాయము పత్రికాపాఠకులకు విదితము. కాని, కోటలలో నవీనపద్ధతి ననుసరించి బ్రియాల్మంటు అనునతఁడు నిర్మించిన కోటలకును ప్రాత కోటలకును వ్యత్యయము కలదు. ఆ కోటల నిర్మాణక్రమము నీ పటము తెలుపుచున్నది.



కోటయొక్క రక్షణమునకై యనేక సాధనములు నిర్మింపఁబడినవి. కోటల పునాదులు మాత్రము సామాన్యముగ సిద్ధము చేయఁబడియుండును. యుద్ధము ప్రారంభము కాఁగానే, అదివఱకు కమర్పఁబడియుండిన భాగములందు యుద్ధోపకరణము లుంచఁబడి శత్రుబలములను భేదించుటకు తగియుండును.



1. ఫిరంగు లమర్చఁబడిన కోట. 2. ముండ్లతీఁగెలను దాటుటకై శత్రుసైన్యములు బల్లలను తీసికొనిపోవుట. 3. ముండ్లతీఁగెలు. 4. భూమియందు మందును నింపి పైన రాళ్లను వేసి కప్పి శత్రువులు వచ్చినప్పుడు మెఱుపుశక్తివలన ప్రేల్చఁబడెడి మందు గనులు. 5. ముండ్లతీఁగెలు. 6. కాల్బల ముందు స్థలము. (పదాతులు నీరు లేని కందకములందు దాఁగియుందురు.) 7. ఫిరంగుల దళము. 8. యంత్రశతఘ్నుల దళము. 9. ముట్టడి యంత్రశతఘ్నులు. 10. యంత్రశతఘ్నులు. 11. లోపలి కందకపు బాటలు, రైలుమార్గములు.

శత్రుబలము ముళ్ళతీఁగెలను సమీపించినపుడు వారి ఫిరంగుల శబ్దము మాఁపఁబడును. అపుడు కోటలోని ఫిరంగులు శత్రువులపై కాల్పఁబడును. మందుతో నింపిన గనులు ప్రేల్పఁబడును. శత్రువులు కోటను రాత్రివేళలందు ముట్టడించినపుడు విద్యుద్దీపము వారిపై ప్రసరింపఁజేయఁబడును. వారి చూపులు మెఱుపుకాంతివలన కనుపింపకుండును. కందకములందు పొంచియుండు పదాతులు శత్రువులను తాఁకి నాశనము చేయుదురు.

ఇట్టి కోటలను బెల్జియనులు జర్మనులు ఫ్రెంచివారు తమతమ సరిహద్దు ప్రదేశములందు శత్రుసైన్యముల నాఁపుటకై కట్టిరి. కాని యవి 12,14,15 అంగుళముల ఫిరంగులవలన నుగ్గునుగ్గుగ చేయఁబడిన విషయము లీజ నామూరు ఆంట్వర్పు లిలీ మాబ్యూజ్ మొదలగు కోటల చరిత్రమువలన తెలియుచున్నది.

సరిహద్దు, మార్గములను సౌకర్యములను నదీముఖములను పరసైన్యమునుండి రక్షించుటకై వర్తమానకాలమునందు ఇనుపకోటలు నిర్మింపఁబడుచున్నవి. వానికి క్యుపోల యని పేరు గలదు. ఆ కోటలయందు యంత్రశతఘ్నులమర్పఁబడి గుండ్రనైన గోపురములను పోలియుండును. ఆవరణము దట్టమైన యుక్కుచే నిర్మింపఁబడును. ఆ కోటలు సిమెంటు పునాదిమీఁదఁగాని యుక్కు పునాది మీఁదఁ బుట్టి గాని యమర్పఁబడి చుట్టిచుట్టి తిరుగుచుండును. నున్నని శిఖరములు మాత్రము కనుపించుచుండును. అవసరమైన దిక్కులందు కోట తిరుగుట నాఁపి గుండ్లవాన కురిపించి శత్రుసంహారము చేయుటకు వీలు గలదు. ఈ క్రింద చూపిన పటములోని కోట యిట్టి విధమున నిర్మింపఁబడినదే.

## కందకములు

కందకమను పదమింతవఱకు కోటకు చుట్టును నుండు నట్టి యగడ్తకు వాడఁబడుచున్నది. కాని యిచట కందకమను పదము సైనికులు భూమియందు గుహాలవలె నిర్మించుకొనిన పొడవైన స్థలముల కన్వయించుచున్నది. రెండు సైన్యములును యుద్ధమునకు సిద్ధముగనున్నపుడు సంరక్షణార్థమై కందకములు నిర్మింపఁబడుచున్నవి. సైనికుల మొన పెక్కు మైళ్ళ దూరము వ్యాపించియుండును. కొన్ని ప్రదేశములందు కదలుటకు వీలు లేకుండును. కొన్ని ప్రదేశములందు సులభముగ శత్రువులు మీఁదఁ బడుటకు వీలుండును. అట్టి సులభమైన స్థలములందు కందకములు నిర్మింపఁబడి సైన్యరక్షణోపాయములు బలపఱుపఁబడును. ఒక పక్షపు సైన్యములు కందకములను దాఁటినఁగాని రెండవ పక్షపు సైన్యమును తాఁకుటకు వీలుండదు. సైన్యసమూహములు కందకముల చాటున నుండి కందకములలోని సైనికులకు విశ్రాంతి నిచ్చుచు బదులు పంపుచు వీలైనప్పుడు శత్రువులతో యుద్ధము చేయుచుండును. కందకములందు సేనానాయకులకు సైనికులకు ఫిరంగులకు యుద్ధద్రవ్యములకు భోజనాదులకు యథాయోగ్యముగ వీలు చేయఁబడియుండును.

కందకములలో సైనికులు వరుసగా గురిచూచుచు కాల్చుచున్నారు. ఒక కందకమునుండి యింకొకదానికి సందుమార్గములు గలవు.



శత్రువులకు నడుమ కంచెగోడలు, గుంటలు, ముళ్లకంచెలు వాడబడిన విధము [illegible] చిన్న [illegible]
[illegible]. [illegible] బాంబులు [illegible].





కందకములు భూమియం దయిదా రడుగుల లోతు కలిగి యుండును. కందకముల గోడలు నేల సిమెంటు పూయఁబడి నివసించుటకు తగియుండును. పైభాగము కప్పు కలిగియుండును. కొన్ని ప్రదేశము లందలివి సామాన్యపు నేలవలెఁ గన్పించుచుండును. సైనికులు తుపాకులను ఫిరంగులను కాల్చుటకును కాఁపరులు చూచుచుండుటకును కంతలుండును. కందకముల మధ్యమున నచ్చటచ్చట యంత్రశతఘ్నులగోచరముగ నమర్పఁబడియుండును. కందకములముందు ముండ్లతీఁగెలుండును. ఫిరంగిగుండ్లు కందకములను సంపూర్ణ

ముగ పాడుచేయఁజాలవు. శత్రువులపై పడుటకు ముందు ముళ్లతీఁగెలను కందకములను పాడుచేయవలయును. లక్షల కొలఁది ఫిరంగిగుండ్లు వానవలె కురిపించి కందకములను పాడుచేసి శత్రువులను తాఁకి యోడింపవలయును.

## గ్రెనాడులు







గ్రెనాడు అను పదము దానిమ్మపండు అను నర్థము నిచ్చుమాటనుండి పుట్టినది. అవి దానిమ్మ పండువంటి యాకృతిని గలిగియుండుట వలన నీపేరుగలిగినది. ఇవి మొదటను 16 వ శతాబ్దమునందు వాడుకకు వచ్చినవి. 1660 సంవత్సరానంతర మీసాధనములు గ్రెనాడియరులను ప్రత్యేక సైనికులచే వాడఁబడుచుండెడివి. పదియేడు పదునెనిమిది శతాబ్దములలోని యుద్ధములందివి తరుచుగ నున్నను పందొమ్మిదవ శతాబ్దమునం దివి అనుపయోగము లైనవి. కాని పోర్టుఆర్థరు ముట్టడియందు తిరిగి ఇవి వాడుకకు వచ్చినవి. అప్పుడు వాటియందు షెల్లులందువలె బలముగ ప్రేలెడి మందుంచుట వాడుకకు వచ్చినది. షెల్లులవలె ప్రేలి నష్టమును గలుగఁజేయగలవు. వర్తమాన మహాసంగ్రామమునందు పరాసులు వీటిని విశేషముగ నుపయోగించు చున్నారు. ఈపటములందు పదునారు పదునేడు శతాబ్దములందు గ్రెనాడులను వేసెడి విధము, ప్రస్తుతము వాటినివేసెడివిధము చేసెడి విధము చూపబడినది.







కందకములను పాడుచేసి కందకములలోని సైనికులను చంపుటకు గ్రెనాడులను నాగ్నేయగోళములు వాడఁబడుచున్నవి. ఫ్రెంచి సైనికులు వానిని తోటాలవలె కాల్చి జర్మనుల కందకములపై వేసి సంక్షోభము కలిగించుచున్నారు. గ్రెనాడుల నడుమ గంధకము సురాకారము తుపాకిమందుగలవు. ఇవి యినుప గుల్లయందుంచఁబడి నిప్పంటించి రగిలినపిదప శత్రువులపై వేయఁబడును.






## గుండ్లు ప్రేలి ముక్క లగుట

ఫిరంగుల ముఖములనుండి వెలువడెడి గుండ్లు ష్రాప్నెలులు షెల్లులు అని రెండు విధములుగ నున్నవి. ష్రాప్నెలునందు సుమారు 300 చిన్న రవ్వ లుండును. ఫిరంగిని కాల్చిన తరువాత ష్రాప్నెలు కొంత దూరము పోయి ప్రేలినపుడు కవచము చిన్నచిన్న ముక్క లగును; రవ్వ లన్ని దిశలందును వ్యాపించును. ఇనుపముక్కలు రవ్వలు జనులను చంపుటకు చాలియుండునే కాని గోడలను గృహములను ఛేదింపజాలవు.



షెల్లులు నిర్మాణమునందు ష్రాప్నెలును బోలియున్నను, కవచమునందు తుపాకిమందు లిడ్డైటు మొదలగు ప్రేలెడు పదార్థము లుండును. షెల్లు ప్రేలుటకు రెండు కారణములు. షెల్లుమొన వేఱొక పదార్థమునకు కొట్టుకొనవలయును; లేక షెల్లునందు, ఫిరంగులను కాల్చుటవలనఁ గలిగెడి వేడికి రగిలెడి వత్తి యుండుట వలన, నది ప్రేలవలెను. షెల్లు ప్రేలి ముక్కముక్కలుగ బ్రద్దలై సర్వసంహారము చేయును. షెల్లుల బరువు 60 మొదలు 2,500 రతులవఱ కుండును. ఈ పటమునందొక షెల్లు పగిలిన విధము చూపఁబడినది.

## గుండ్లవాన కురిపించు యంత్రము

జర్మనులు తమ కందకములనుండి షెల్లులవాన కురిపించుటకై యొక యంత్రమును నిర్మించిరి. ఆ యంత్రము ముఖమున షెల్లులను బాంబులను నుంచి మఱను త్రిప్పిన, నవి దూరమునం దుండు శత్రువులపైఁ బడి శత్రుసంహారమునకు తోడ్పడును. ఈ పట మా యంత్రాకారమును చూపుచున్నది.





జర్మనులు రాత్రులందు షెల్లులను గాల్చునపుడు చీకటివలన గురిపెట్టుటకు వీలుండుటకై ఒక యుపాయమును గనిపెట్టిరి. ప్రతిషెల్లునకును నొక పారచ్యూటు కట్టియుండును. పారచ్యూటు ముడచబడియుండును. షెల్లు పగిలినపుడు పారచూటు వీడి షెల్లులోని రవ్వలంటుకొని పెద్దదీపమువలె కొన్ని నిమిషములు వెలుతురు నిచ్చును. ఆ వెలుతురునుబట్టి శత్రుసైన్యములను గుర్తించుచు షెల్లులను గాల్చుటకు వీలుగలుగును. దీనిని క్రూపు యంత్రాలయాధిపతులు నిర్మించిరి. ఇట్టి నిర్మాణము లితర రాజ్యములకును గలవు. వాటికి నక్షత్రగుండ్లని పేరు గలదు.

ఈ పటమునందు జర్మనులు షెల్లునకుగట్టిన పారచ్యూటు వీడివెలిగి వెలుతురు నిచ్చెడి విధము చూపబడినది.

మానవులందువలెనే జాతులకును రాజ్యములకును కూడ వర్తిల్లు చున్నది. ప్రజలకు స్వార్థపరత్వము హెచ్చినకొలఁదిని దేశాభిమానము క్షీణించి దేశ మంతఃకలహములకును పరభేదనమునకును లోనగు చుండును. పోలండు దేశపు సామంతులలో స్వలాభము పెరిగినది. మాత్సర్యము వృద్ధియైనది. ద్రోహచింత వ్యాపించినది. రాజ్యాంగము నానాటికి దుర్బల మయ్యెను. ప్రష్యా ఆస్ట్రియా రష్యా రాజ్యములు పోలండు రాజ్యపు సరిహద్దులలో నున్నవి. పోలండు రాజ్యపు క్షీణదశ కీ మూఁడు రాజ్యముల యాశాపరత్వమును తోడుపడినది. మానవుల సంపదవలెనే రాజ్యముల సంపద కూడ నస్థిరము, చంచలము. రెండు శతాబ్దములనుండి పోలండులో స్వేచ్ఛగ విహరించుచున్న రాజ్యలక్ష్మి క్రమక్రమముగ రష్యా ఆస్ట్రియా దేశముల నాశ్రయించెను. దీనికి తోడు, దేశమునందలి కేంద్రీకృతాధికారము లుప్తము కాసాగెను. సకల రాజ్యాధికారమును కేంద్రీకృతము చేయఁగల నాయకులు లేకపోయిరి. సామంతుల యధికారప్రాబల్యమే యొక విధముగ పోలండు రాజ్యపు క్షీణతకు కారణమని చెప్పవచ్చును.

పదునెనిమిదవ శతాబ్ద మధ్యమున వివేకశూన్యుఁడగు రెండవ అగస్టసువలన దేశము నాశనము నకు సంసిద్ధమైనట్టి స్థితి వచ్చినది. కాని రష్యాదేశపు రాజగు పేటరు మహారాజు ప్రతిభవలన అప్పటి కా స్థితి తప్పినది.

ప్రష్యాదేశపు రాజగు ఫ్రెడరిక్ మహారాజు ప్రజ్ఞా సంపన్నుఁడు, స్వయంకారేచ్ఛాపరుఁడు. క్షీణదశకు వచ్చియుండిన పోలండు రాజ్యమును పంచుకొను తలంపు మొట్టమొదట ఫ్రెడరిక్ రాజున కుదయించినట్లు చెప్పుదురు. సమయము దొరకినా మ్రింగుదుమా యని కనిపెట్టుకొనియున్న సమీపరాజ్యములకు కొంత భాగము నిచ్చి మిత్రత్వమును సంపాదించుట కీతఁ డాలోచించెను. ఫ్రెడరిక్ 1740వ సం.న రాజ్యాధికారమునకు వచ్చి తన శక్తిసామర్థ్యములను రాజ్యవ్యాప్తికై వినియోగింప మొదలుపెట్టెను.

ఇతఁడు ఆస్ట్రియా సామ్రాజ్యముతో పోరాడి సామ్రాజ్యమునకు చెందిన సైలీషియా మండలమును సంపాదింపఁగలిగెను. ఇతని దాహశక్తి సమీపమందున్న పోలండు రాజ్యములోని భాగములను మ్రింగుటకై సమయము వేచియుండెను. అంతకు పూర్వ మునుండియు రష్యాదేశపు చక్రవర్తినియగు రెండవ కాథెరైను పోలండు రాజ్యవ్యవహారముల నమిత భక్తితో మాయను ప్రసక్తి కలిగించు కొనుచుండెను. రష్యా సమ్మతించినఁగాని దేశమును పంచు కొనుటకు వీలు లేదని ఫ్రెడరిక్ గ్రహించియుండకపోలేదు. అందువలన ఫ్రెడరిక్ తన దృష్టిని రష్యావైపునకు మరలించి 1760వ సంవత్సర మధ్యమున దేశమును పంచుకొను విషయమును మెల్లగ రష్యాదేశపు రాణికి సూచించెను.

ప్రథమమున నీ భావము రష్యావారికి కంటకముగ నుండెను. పోలండు రాజ్యమును విభజింపఁగూడ దని యావత్పోలా రాజ్యము లన్నింటిలోను రష్యారాజ్య మొక్కటే తన యసమ్మతిని నట్టిగా ప్రకటించెను. కాని యాస్ట్రియా సాక్సనీ టర్కీ మున్నగు నితర రాజ్యము లిందునకు తమ యంగీకారము నిచ్చినవి. ఇతరరాజ్యములు సయితము విభాగము కూడ దని చెప్పలేకపోయినవి.

దేశబలము నానాటికి క్షీణింప నారంభించెను. అంతఃకలహములు వృద్ధియైనవి. కక్షలు పెరిగినవి. పోలండు ఛిద్రావస్థయం దుండెను. ఎవరికి తోఁచినది వారు పంచుకొనఁదలఁచిరి. నోరు కలవారికి పలుకుబడి యుండుటయు లేనివారి మాట చెల్లకపోవుటయు సహజము. దీనివలన అధికారుల గోష్ఠుల వ్యత్యాసము వృద్ధియగును. ప్రబలరాజ్యధ్వంసనీతి యుద్ధరింపఁబడెను. అందుచేత రాజులు సమష్టిమీఁద పోలండును పంచుకొనుట సంభావ్య మని యెంచిరి.

పోలండునకు రానుండిన కష్టదశను తలఁచుకొనినప్పుడెంతటి కఠినాత్ముల కైనను గాఢమగు విచారము కలుగకమానదు. పోలండు రాజ్యవిభాగమును మొదట ఫ్రెడరిక్ సూచించెను. దీనికి నూరు సంవత్సరములకు ముందే దేశస్థితి శోచనీయముగ నుండెను. రాజ్యవ్యవహారములను రాజు చూచుట మానివేసెను. దేశము దుర్దశాక్రాంత మైనది. సేన తీసివేయఁబడినది. కోశాధికారులు ప్రజల ధనము నపహరించి పోగుచేసుచుండిరి. దేశ మరాజకమై ప్రవర్తింప నారంభించెను.

1765వ సంవత్సరమున ప్రజ లొకసారి కన్ను తెరచిరి. కాని యీ ప్రబోధము చాల కాలము నిలిచినది కాదు. అనర్థదాయకం బగు "సర్వజనాంగీకార పద్ధతి" రద్దుచేయఁబడినది. ఫ్రెడరిక్ మహానుభావుని కుట్రలవలన దుస్థితి తిరిగి తలయెత్తినది. పోలండు తన రాజ్యము నుద్ధరించుకొని స్వాతంత్ర్యమును నిలుపుకొనుట యీ చక్రవర్తికి కొంచమైన నిష్టము లేకుండెను.

దైవనిర్ణయమును గుర్తింపఁజాలము. శత్రువులు మిత్రులుగను మిత్రులు శత్రువులుగను మారుచుందురు. ఆస్ట్రియా ప్రష్యాల నిరంతరవైరము క్రమక్రమముగ మిత్రత్వముగ మారి ఫ్రెడరిక్ పన్నుగడ ఫలించెను. పోలండు రాజ్యవిభాగమునకు రష్యా వెనుకతీసె నప్పుడు ఫ్రెడరిక్ తన వైపున కాస్ట్రియావారిని త్రిప్పుకొనెను. తోబుట్టువు రాజ్యమును నేలమట్టముచేయుచున్న మేరియా తెరీసాకు పోలండు రాజ్యవిభాగము గిట్టలేదు. కాని యామె కుమారుఁడు రెండవ జోసెఫును ప్రధానమంత్రియగు కౌనిట్జును యామె మాటకెదురాడి ప్రష్యావారును రష్యావారును పోలండును పంచుకొనుచుండ తాము చేతులు ముడుచుకొని యిన్నకుండుట యనుచిత మని చెప్పి పట్టుపట్టుకొని పోరిరి. ఈ స్వార్థపరత్వవాదమును మతగురువులు కూడ తమకు సాధ్యమైనంతవఱకు బలపఱచుచు, రాజ్యనీతికిని వ్యక్తినీతికిని సంబంధ మెంత మాత్రము లే దని వాదించి యామెను తన నిజాభిప్రాయమునుండి మరలించి వంచించిరి. ఈబలవత్ప్రోత్సాహము నామె నిరోధింపలేక యొక మూల హృదయము కంటగించుకొను చుండినను పోలండు విభాగమునకు తన యనుమతి నియ్యలేక యియ్యలేక యిచ్చెను.

మేరియా తెరీసావలెనే రష్యాచక్రవర్తినియు నీ సామ్రాజ్య

విభాగమును కంటగించుకొనెను. పోలండు రాజ్యమును చెక్కుచెదర నీయ వని యీమె నిష్కపటభావముతో రెండు వాగ్దానము చేయుచు వచ్చినది. రష్యా ప్రాబల్యమును వ్యాపింపఁజేయుటయే యీమె యుద్దేశము. పోలండు పంచుకొను తలం పీమెకు కలుగలేదు. కాని యాస్ట్రియావారి సంకల్పమున కీమె కూడ లొంగిపోవలసివచ్చెను.

ప్రెడరిక్ మహాపురుషుని తంత్రప్రాబల్యము ఫలవంత మైనది. ఆస్ట్రియా రష్యా దేశముల వైరమును వృద్ధిచేసి తన మనోరథమును నెఱవేర్చుకొని వారిచేత తన కష్టము లేని కార్యమును చేయుట కేర్పాటు సమకట్టించెను. ప్రెడరిక్ చేసిన యీ మహాతంత్రోపాయమును కేత్రైను రాణి మఱచిపోలేదు. జర్మనీ రష్యాల వైరమున కీ వ్యవహారములే కారణము లని యూహింపఁబడు చున్నది.

పోలండును పంచుకొనుటకు 1772-వ సంవత్సరము ఆగష్టు నెల 5-వ తేదిని పీటర్సుగ్రాడు (సెయింటుపీటర్సుబర్గు)లో సంధి జరిగెను. దేశము లోని స్థితిగతులు బాగుగ మండినందున సమీపరాజ్యముల శాంతికి భంగము కలుగు నని రష్యా ఆస్ట్రియా ప్రష్యా దేశములవారు లోకులకు నచ్చఁజెప్పినను, వీరు రెండుకోట్ల పోలుల కేమియు సమాధానము చెప్పలేకపోయిరి. వీరెన్నఁడుకూడ పోలులతో నాలోచింపనైనను లేదు. వీరు తమ దేశమును పంచుకొందు రని పోలులు కలలోనైన ననుకొని యుండలేదు.

ఈ విభజనమువలన పోలండులో మూఁడవ వంతుకంటె నెక్కువ రాజ్య మితరులపా లయినది. ఆస్ట్రియా కెక్కువ వంతు వచ్చెను. ప్రష్యా చక్రవర్తి తాను ప్రత్యేకము కోరుకొనిన భాగమును తీసికొనెను. దీనినే యిప్పుడు తూర్పుప్రష్యా యని పిలుచు చున్నారు. లిథోనియా రాష్ట్రమును మరికొన్ని జిల్లాలును రష్యావంతునకు వచ్చినవి. న్యాయము నాలోచింపవలసివచ్చినయెడల, నీ జిల్లాలొకానొక కాలమున రష్యారాజ్యముక్రింద నుండినట్లు చెప్పవలసి యున్నది.

ఈ విభాగమువలన కొంత కాలమువఱకు నేవిధమైన యిబ్బందియు కలుగలేదు. ఆస్ట్రియా రష్యా జర్మనీలు పంచుకొనిన భాగము లన్ని విధముల మంచి స్థితిలోనికి వచ్చినవి. దీనిని చూచి, పంచుకోఁగా మిగిలియున్న పోలండులోని ప్రజలు తమ దేశమును కూడ మంచి స్థితిలోనికి తెచ్చుకొనుటకై ప్రయత్నింపసాగిరి. రష్యావారి రాజ్యప్రకృతి ననుసరించి 1775-వ సంవత్సరములో పోలండురాజ్యమునందు నూతనపద్ధతు లేర్పాటు చేయఁబడినవి. మూఁడు సంవత్సరముల తరువాత, పార్లమెంటువా రన్నియో సంస్కరణములను చేసిరి. బలసంపదలకు నిలయము లగు రష్యా ప్రష్యా ఆస్ట్రియా సామ్రాజ్యములు పోలండున కిరుగుపొరుగుగ నున్నవి. చివరకు పోలులు వీరు చెప్పినట్లు నడుచుకొనవలసినవా రైరి. ఈ సామ్రాజ్యములవారు సమయము దొరకినప్పుడు దేశములోని యితరభాగములను కూడ మ్రింగివేయుటకు కనిపెట్టుకొని యుండిరి.

అట్టి సమయము 20 సంవత్సరములకు వచ్చినది. 1791-వ సంవత్సరములో దేశమున నూతనోద్యమము బయలుదేఱినది. ఇతరుల సంబంధము లేకుండ పోలులు నూతన రాజ్యపద్ధతి నేర్పాటు చేసికొనిరి. రాజ్యము వంశపారంపర్యముగ రావలయు ననెడి యాచారము తిరిగి నెలకొల్పఁబడినది. "సర్వజనాంగీకారపద్ధతి" రద్దుచేయఁబడినది. పట్టణపు ప్రతినిధులు పార్లమెంటు సభ్యులుగ నంగీకరింపఁబడిరి. వ్యవసాయకుల యర్థప్రాణముల కేవిధమైన యిబ్బందియు కలుగకుండ తగిన శాసనములు శాసింపఁబడెను. ఎన్నఁడును రైతు లిట్టి రక్షణమును పొందియుండలేదు. పోలులు స్వతంత్రించి రాజ్యాంగమునం దిట్టి మార్పులను చేసికొనుట ప్రష్యా రష్యాలకు తలనొప్పిగ నుండెను. పూర్వము రష్యావారు చెప్పిన రాజ్యపద్ధతికి పోలు లంగీకరింపలేదు. రష్యాప్రష్యాలకు కోపము వచ్చినది. వారు పోలండుమీఁద పడి యుద్ధము చేసి రష్యా చెప్పిన రాజ్యపద్ధతి నంగీకరించుటకు నిర్బంధపఱచిరి. రాజ్యాంగములో మంచి పద్ధతుల నేర్పఱచుకొనుటకు యత్నించుటయే గొప్ప నేర మైనది. పోలండులో పోఁగా మిగిలియున్న సగము దేశమును వారి కపరాధముక్రింద మునుపు చెల్లింపవలసివచ్చెను. ఈ పర్యాయము ప్రష్యా రష్యాలు మాత్రమే పంచుకొనినవి. 1793-వ సంవత్సరము జనవరినెల 4-వ తేదిని చేసికొనఁబడిన సంధిలో నీ యేర్పాటులు జరిగినవి.

ఇఁక పోలండునకు లక్ష నలువదియొక్క వేల చదరపు మైళ్లు మిగిలియున్నవి. అనఁగా చెన్నరాజధానిలో సుమారు సగము భాగ ముండెను. రష్యా ప్రష్యాలు చేసిన కార్యము పోలులకు కడుపుమంటను కలిగించినది. కాసియుస్కో యను మహాధీరుఁ డమెరికా విప్లవమునందు పని చేసెను. ఇతఁ డీ సమయమునకు నాయకత్వము వహించి, పోలుల కావేశము కలిగించెను. వీ రందఱు నేకీభవించి స్వాతంత్ర్యమును సంపాదించుటకు సంసిద్ధులై నిలిచిరి.

యుద్ధము ప్రారంభ మైనది. పోలు లతిధైర్యముతో పోరిరి. కాని విజయలక్ష్మి శత్రువుల వశ మైనది. ఫ్రాన్సు ప్రజాప్రభుత్వ మేమైనా తమకు సాహాయ్యము చేయు నని పోలులు గంపెఁ డాశ పెట్టుకొనిరి. చివర కా యాశ నిరాశ యయ్యెను. రష్యా ప్రష్యా ఆస్ట్రియా లేకము కాకుండ పోలులు ప్రయత్నించిరి. కాని యుద్యమము భగ్నమయ్యెను. దేశమునందు ప్రజల కంఠశోకకలహములు పుట్టినవి. దేశవిమోచనమునకై యారు నెలలు ప్రాణములకు తెగించి హోరాహోరిగ పోరాడిన పోలుల రక్తము ప్రవాహములై పాఱినది. సేన క్షీణించినది. నిర్జనమై యున్న దేశము శత్రురాజుల కధీన మైనది. పోలండు దేశపు రాజు స్టానిసును ప్రజానాయకుఁ డగు జనరలు కాసియుస్కోయు రష్యాముఖ్యపట్టణమునకు ప్రవాసము పంపఁబడిరి.

పోలం డధోగతికి వచ్చు కాలము సమీపించినది. దీనిని పంచుకొనఁ దలఁచినవారిలో కలతలు వచ్చినందున కొంతకాలమువఱకు నూరకుండి 1795-వ సంవత్సరము జనవరినెల 3-వ తేదిని రష్యా ఆస్ట్రియాలు పోలండును మూఁడవ సారి పంచుకొనినవి. దీనికి ప్రష్యా

నీగ్రో యధోగతి చెందెడివారే. కాని మాంటినీగ్రో పర్వతప్రాంతములలో, తమ యశ్వబలము నిరుపయోగమైనందున తుర్కీవా రపజయము పొందిరి. తుర్కీవా రింకెటి నష్ట మెప్పుడు నొందియుండలేదు. ఆర్ స్లాగ్ పాషాకు గాయములు తగిలెను. రెండవ సేనానియొక్కయు మతి మూడు రధికారులయొక్కయు తలలు గొనిపోబడి సెటింజె కోటయొక్క బురుజులపై వ్రేలింపబడెను.

ఈ యపజయములవలన తురుష్కుల కపకీర్తి హెచ్చెను. మాంటినీగ్రోనుల ప్రతిభ ప్రబలెను. 1623 వ సం. లో సొలామన్ పాషా యను తురుష్కప్రభువు 80,000 సైన్యముతో మాంటినీగ్రోను ధ్వంసము చేయ నడుకట్టి యెవని దివము లభించునట్లు పోయి సలీవ్ మాంటినీగ్రోనులను వారి ముఖ్యపట్టణమగు సెటింజెకి తరిమివేసెను. సెటింజె నాక్రమించుకొనెను. మాంటినీగ్రోనులు లోబడిరి; తురుష్కులకు కప్పము కట్టవలసిన వారైరి. కాని మాంటినీగ్రోనులు తమ దేశమందలి యుద్ధములలో గొప్ప సేనలు దుర్భాధచే వశింపవనియు స్వల్పసైన్యాధిపతులు జయింతు రనియు నిదివఱకుండిన సిద్ధాంతము మనసునందుంచుకొని కొంత సైన్యము సార్వేనియా వైపునుండి మరల్చి తురుష్కులను ముట్టడించి వారిని మరల జయించిరి.

మాంటినీగ్రోనులకును ఆల్బేనియనులకును గల మతభేదము వీరి నైకమత్యహీనులను జేసి యుభయులను తురుష్కులయొక్క ప్రతాపమునకు లొంగునట్లు చేసినది. మాంటినీగ్రోనులకును తురుష్కులకును జరిగిన పోరాటముల నెన్నజొచ్చిన వేలకొలంది గలవు. పాఠకులకు విసుకు పుట్టును. తురుష్కు లొకసారి అహమెటు పాషా యాధిపత్యముక్రింద 60,000 సైన్యముతో మాంటినీగ్రోపైకి వచ్చినప్పుడు జరిగిన ఘోరయుద్ధములో నిరువదివేల మంది తురుష్కులు రణరంగమున చనిపోయిరి. మున్నూరుమంది మాంటినీగ్రోలుమాత్రమే నష్టమైరి. మాంటినీగ్రో విశేషించి పర్వతప్రదేశ మగుటచే నెంతటి సంఖ్యగల సైన్యములను నచటి యుద్ధమునకు తెంతురు. తరువాత యిరువది సంవత్సరములలో తురుష్కులు మాంటినీగ్రోపైకి యిమ్మారు దండెత్తిపోయి యోడింపబడిరి. ఒక యుద్ధములో వేయిమంది మాంటినీగ్రోలు 20 వేల మంది గల తురుష్కసేన నిరువది సారులు పాఱద్రోలిరి. ఈ నిరంతర కలహములవలన నొక జిల్లాలో కూడుల మాంటినీగ్రోలు 40 మంది మాత్రమే మిగిలిరి. కాని క్రైస్తవదేశము లన్నిటిలోను వీరి ప్రతాపము హెచ్చెను. 1735.వ సం. లో మాంటినీగ్రో రాజగు మొదటి డానిలో మరణించినప్పు డతని కుమారుడగు సావాకు దక్కినది యతనికీర్తిమాత్రమే.

సావా రష్యా జర్మనులతో స్నేహము చేసికొనెను. రష్యా చక్రవర్తి యితనిని గౌరవముగ చూచెను; ఇతని దేశమునకు సాలునకు 3000 రౌబిలలను నాణెము లొసంగుచుండెను; తుర్కీతోడి కలహములలో నంతరించిన పౌరకాలల యుద్ధారణము నిమిత్తమితని దేశమునకు సాలునకు 1000 డ్యూకట్లు నిచ్చుచుండెను. సెంటు పీటర్సు బర్గులో నున్న సైనికశిక్షణాలయములో మాంటినీగ్రో బాలుర పదునైదుగురకు విద్యాశిక్షణ మొసంగుచుండెను. పిమ్మట 1766.వ సం. లో సావా మరణించెను.

1782—1830

ఒకటవ పీటరు కరుసమర్థుడు, శూరుడు, పట్టుదల గల వాడు. ఈతని పరాక్రమమువలన ఆస్ట్రియా రష్యా యింగ్లండులు కూడ నితని సహాయము నపేక్షించుటకు సంశయింపకుండెను. అతని మోటు సైనికులు నెపోలియను నాకే వాటంకపరుపగలిగిరి. 1788.వ సం. లో ఆస్ట్రియా రష్యాలు తుర్కీపై యుద్ధము ప్రకటించినప్పుడు మాంటినీగ్రోవారి సహాయము గోరిరి. 1807.వ సం. లో జరిగిన టిల్ సిట్ సంధివలన బొకె ఫ్రెంచివారిక్రిందికి వచ్చెను. నెపోలియను మాంటినీగ్రోను లసాధ్యులనియు వారి నణచుటకు ప్రయత్నించుటకన్న వారితో మిత్రభావము గలిగియుండుట శ్రేయస్కర మనియు గ్రహించెను; తన సొంత కర్చుతో మాంటినీగ్రోలో బాటలను వేయించెద నని చెప్పెను. కాని మాంటినీగ్రోనులు బండ్లు రాగలిగిన బాటలలో ఫిరంగులు గూడ సులువుగ తమ పైకి రాగలవని గ్రహించి యీబాటల సదుపాయమును నిరాకరించిరి. తమ దేశములలో బాటలు లేకపోవుటకు తగిన సదుపాయములు లేమియే, తమ స్వాతంత్ర్యమును కాపాడుచున్న దనియు, ఆ ప్రకృతిరక్షణ సాధనములను మార్చుట తమకు హానికర మనియు వీరి సిద్ధాంతము. మాంటినీగ్రోను పీటరిని తన్ను నిరసించి రను కోపముచే నెపోలియను వారి దేశమును రూపుమాపుటకు శపథము చేసెను.

1830—1860

మొదటి పీటరు తదనంతర మతని పుత్రుడు, రెండవ పీటరు సింహాసనమునకు వచ్చెను. ఇతడు మహాబలిష్ఠుడు. 1820.వ సం. గలిగిన యపజయము మొదలు తురుష్కులు మాంటి నీగ్రో మాట తలపెట్టరయిరి. 1832.వ సం. లో ఆల్బేనియా తిరిగి తురుష్కులకు స్వాధీన మాయెను. కాని తురుష్కులు మాంటినీగ్రోనుల శౌర్యపరాక్రమములను మరువలేదు. వీరిని నయమున సాధింపవలెనను సంకల్పముతో 1856.వ సం. లో మాంటినీగ్రో రాజసంశము యొక్క పారంపర్యపు హక్కును తా మొప్పుకొనెద మనియు మాంటినీగ్రోకు మరికొంత దేశమును గూడ నిచ్చెద మనియు తురుష్కుల యాధికారమును మాత్రము మాంటి నీగ్రోను లంగీకరింపవలయునని యు తురుష్కులు మాంటినీగ్రోనులను కోరిరి. దీనిని మాంటినీగ్రోనులు నిరాకరించిరి. స్వల్పదేశమున కాశపడి సుల్తానులకు తలయొగ్గుట కే మాంటి నీగ్రో మానవుడును నొప్పుకొనడాయెను. తురుష్కులు తిరిగి దండెత్తి వచ్చి పూర్ణముగ నోడిపోయిరి. రెండవ పీటరు మిగుల శూరుడు; 6 అడుగుల 9 అంగుళములయెత్తు గలవాడు; దయాసక్తుడు. 1845.వ సం.న తన దేశమునకు గలిగిన క్షామములో నితడు తన నగల నన్నిటి నమ్మి స్టీమరులకొలంది ధాన్యమును తెప్పించి ప్రజలకు పంచిపెట్టించెను. ఇట్టి మహామహుడు 1851.వ సం.లో మరణించెను. ఈతనికి పిమ్మట రెండవ డానిలో రాజయ్యెను.

ఇతఁడు విశేషమగు మతభక్తి గలవాఁడు కావుచే, నితని కాలములో రాజ్యాధికారము మతాధికారము వేఱుచేయఁబడెను. రెండవ పేటరు కాలమున శాంతముగ నుండిన తురుష్కులు తిరిగి రెండవ డానిలో కాలమున మాంటినీగ్రోపైకి వచ్చిరి. ఓమర్ పాషాను తురుష్కులు మాంటినీగ్రోపైకి పంపిరి. తుర్కీ నౌకాబలము అల్బేనియా రేవును ముట్టడించెను. డానిలో రష్యా ఆస్ట్రియాల సహాయమునకై రాయబారి నంపెను కాని రాయబారి తిరిగిరాకపూర్వమే 1850.వ సం॥ జనవరి నెల 20 వ తేది రాత్రి మాంటినీగ్రోనులు ఓమర్ పాషా సైన్యముమీఁద పడి 17 పట్టణములను నాశనము చేసి 370 మంది నౌరి తురుష్కుల తలలను గొనిపోయిరి. ఇంతలో ఆస్ట్రియా రష్యాలు కాన్‌స్టాంటినోపిలులో సంధి సాగింప మొదలుపెట్టెను. ఇవి యన్నియు లక్ష్యపెట్టక ఓమర్ ఆస్ట్రోగ్‌వరకు వచ్చెను. కాని, విశేష నష్టము నొందెను. ఇంతలో వర్షకాలము వచ్చెను. నదులు దాఁటుట కలవికాకుండెను. దీనికి తోడు సుల్తాను యుద్ధము నాఁపుట కుత్తరువులిచ్చెను. ఈ యుద్ధము జరిగిన మూడు మాసములలోను 4,500 మంది తురుష్కులు యుద్ధభూమి కర్పితులైరి. ఇంతకంటె నెక్కువమంది వికలాంగులైరి. 900 మంది ఖైదీలుగ పట్టుకొనఁబడిరి. ఈ విధముగ తురుష్కులతో వీరు పోరాడిన యుద్ధములు లెక్కకు మిక్కిలిగ నున్నవి. వాని నన్నిటిని గూర్చియు చదివినచో, నెట్టి మానవులకును మాంటినీగ్రోనులకు సాటి యోధులు లేరని తోఁచకమానదు. ఎన్ని యుద్ధములం దెన్నిసారు లపజయము నొందినను క్రౌర్యముతో, తమ వైరుల శౌర్యము నెఱింగియు నిరుత్సాహులు గాక, యుద్ధమునకు పునఃప్రయత్నములు చేయు తురుష్కుల చరిత్ర మసమానమని కూడ తోఁచకమానదు.

నూరుల కొలంది యుద్ధములం గలిగిన యనుభవముచే సైనిక శిక్షణ మవశ్యమని తోఁచి 1853.వ సం. న డానిలో సైనిక శాసనమును నిర్మింప మొదలిడెను. ఇప్పటివఱకును మాంటినీగ్రో సైనికులకు శిక్షణము లేదు. యుద్ధము వచ్చిన దినముతోడనె మూలమూలలనుండి ప్రజలందఱు కొన్ని గంటలలో ప్రోగగుదురు. ప్రాచీనా యుద్ధము లగు కత్తులు కటారులే వీరికిఁ గల యాయుధములు. దీనికి తోడు శత్రువులనుండి యప్పుడప్పుడు యుద్ధములలో పట్టుకొనిన యసంఖ్యాకములగు ఫిరంగులు తుపాకులు కూడఁ గలవు. యుద్ధము ముగిసినతోడనే యుతర పల్లెలకు వారు పోయి సేద్యము చేసికొను చుండెడివారు. డానిలో 18 మొదలు 60 సం. ల వయసు గల ప్రతిమానవుని సైనికునిఁగ చేర్చుకొనెను.

1854.వ సం. లో క్రిమియా యుద్ధము పొసఁగెను. మాంటినీగ్రోను తటస్థముగ నుండు మని యాస్ట్రియా రా జొత్తిడి చేసెను. యుద్ధధ్వని వినినతోడనే యుత్సాహితు లగు మాంటినీగ్రో ప్రజలు కలహమునకు కాలు ద్రవ్వుచుండిరి; సరిహద్దులలోని తురుష్కులను వధింపసాగిరి.

1857.వ సం. లో డానిలో ప్యారిసును సందర్శించినపుడు సుల్తానునకు నామమాత్రము తాను లోఁబడినచో దానికి ప్రతిఫలముగ కొంత దేశము నిప్పించెద మనియు, తుఆకల రేవులలో మాంటినీగ్రో పతాక ముండునట్లు చేసెద మనియు చెప్పిరి. ఈ పద్ధతి నిరువది లైన వత్సరముల క్రిందట రెండవ పేటరు నిరాకరించెను. దాని నిప్పుడు రెండవ డానిలో యంగీకరించెను. ఈ నీచపు టొప్పుదల స్వాతంత్ర్యప్రియులును పరాక్రమవంతులును నగు మాంటినీగ్రో ప్రజల కనిష్టము కలిగించెను. దేశమునం దసంతుష్టి ప్రబలెను. సామంత నాయకు లనేకులు తిరుగఁబడిరి. వారి నణఁచుటకు డానిలో కింతో శ్రమ యయ్యెను.

ఇ దంతయు నిట్లుండఁగ, సంధిని సరకుచేయక తురుష్కులు 7,000 మంది సైనికులతో హుసేన్ పాషాను ఉత్తరప్రాంత దేశము పైకి పంపిరి. ఆస్ట్రియా రష్యాలు డానిలో మొఱకు నెడచెవి నిడెను. ఫ్రెంచి చక్రవర్తి యగు మూడవ నెపోలియను మాత్రము వీరికి తోడ్పడి తన నౌకాదళమును రగూసాకు పంపెను. డానిలో సోదరుఁ డగు, మిర్కో సైన్యము నడపెను. గ్రహోవోయొద్ద యుద్ధము జరిగెను. మే నెల 3.వ తేదిని యుద్ధ మారంభ మాయెను. మృత్యు వాసన్నం బైనను తురుష్కులు మాంటినీగ్రోపైకి వత్తు రనినట్లు మిర్కో తురుష్క సైన్యములను తుత్తునియలు చేసెను. ఎక్కడి ఫిరంగులకడ నుండు యోధు లక్కడనే వధింపఁబడిరి. పరలిపోవుటకు వీలు లేకుండ కనుమ ద్వారమున నొక సేన కావలి యుండెను. కొన్ని వారములకు పిమ్మట యుద్ధభూమిని చూచిన యొక యాస్ట్రియా యధికారి యప్పటి కింకను 2,237 శవములు యుద్ధభూమియం దున్నట్లు చెప్పెను. 4,500 మంది మాంటినీగ్రోనులలో 400 మంది మాత్రము హతులైరి. తురుష్కుల నష్ట మింత కనిమిది రెట్లు కధిక మాయెను.

1858.వ సం.లో గొప్ప రాజ్యముల రాయబారు లందఱును కాన్‌స్టాంటినోపిలులో సమకూడి మాంటినీగ్రోకును తుర్కీకిని గల సరిహద్దు వివాదము నాలోచించిరి. కాని వీరి యేర్పాటు సఫలము కాకపోయెను. పిమ్మట జరిగిన రెండు యుద్ధములలో నిది స్పష్ట మయ్యెను. 1855.వ సం. న డానిలో వ్రాసిన న్యాయశాసనము 1888.వ సం. వఱకు అమలులో నుండెను. పిమ్మట విశేషకాలము గడువకముందే 1860.వ సం. లో నితఁడు చంపఁబడెను.

లక్సెంబర్గు రాష్ట్రము:—ఫ్రాంసు బెల్జియము, జర్మనీలకు మధ్యనున్న యొక చిన్నరాష్ట్రము. వైశాల్యము 1000 మైళ్లు. జనసంఖ్య 2½ లక్షలు. పార్లమెంటు కలదు. పాలకురాలు గ్రాండ్ డచెస్ మేరీ అనునామె. జర్మనులు ఫ్రాంసుపయిన పడుటకయి సంధుల నుల్లంఘించి ఈరాష్ట్రమును ప్రవేశించిరి. ఆదివారము ఆగష్టు రెండవ తేదిన ఈరాష్ట్రములో బ్రవేశించుచున్న జర్మను సైన్యము నెదుటతనమోటారుబండినెక్కి రావలదని ఈమె అడ్డముగా నిలిచెను. పిస్తోలుతో జర్మనులీమెను చంప బోయిరి. ఇది అక్రమమని ఈమె కేయిజరుగారికి తెలియజేసెను. ఈమె మొరల నెవరును వినినది లేదు. జర్మనీకి ఖయిదీగా తీసికొని పోబడినదను వదంతి గలదు. ఈ రాష్ట్రమునంతయు జర్మనులు బెల్జియమును వశము చేసికొనినట్లు వశముచేసికొని యేలుచున్నారు.

లాయడ్ జార్జిగారు—1890లో పార్లమెంటులో బ్రవేశించెను. సొలిసిటరుగా జీవిత మారంభించెను. సంగ్రామప్రసంగములయందు పెట్టినది పేరు. కోశాధ్యక్షుడుగా నుండి, ఇప్పుడు యుద్ధపరికరముల మంత్రిగా నియోజింపబడెను. మహావక్త. వృద్ధాప్య వేతనముల నింగ్లండులోని బీదల కిప్పించెను. జబ్బుపడిన పనివాండ్రకును, అవయవములు కర్మాగారములలో పోయినవారికిని ఉపకారవేతనము లిచ్చుపద్ధతిని ఆచరణములోనికి దెచ్చెను. ఈయన కుమారు లిద్దరు యుద్ధభూమిలో నున్నారు.

లూసిటానియా:—32,500 టన్నుల బరువుగల వర్తక నావ. దీనివంటి నావలు లోకములో నయిదారు కంటె నెక్కువ లేవు. నిర్మించుటకయిన వ్యయము 1కోటి 85½ లక్షల రూపాయలు. మే 7 వ తేదీన ఇంగ్లండు తీరమునకు 20 మైళ్లు దూరములో నుండగా జర్మను సబ్మెరయిను టార్పెడో వేసి ముంచెను. ఇందు 1959 మంది ప్రయాణికు లుండిరి. 900 మంది రక్షింపబడిరి. మిగిలినవారు మరణించిరి.

లేమన్. జనరలు:—లీజికోటల ననేక దినములు జర్మనుల వశముకాకుండ జేసి లోకప్రసిద్ధినొందిన సేనానాయకుడు. నగరము శత్రువుల వశమయినపిమ్మట లోసింస్ కోటలోనికి వెళ్లి ఫ్రెంచివారి సహాయము వచ్చునేమో యను ఆశతో చాలరోజులు పోరాడెను. జర్మను లొక్కొక్క కోటను పిండిపిండిజేసి ఈకోటను వశముచేసికొనినప్పుడు కోటకప్పు కూలుటవలన కాళ్లకు దెబ్బతగిలి స్మారకముతప్పి పడియుండెను. తరువాత జర్మను జనరలువద్దకు తీసికొనిపోగా లొంగిపోతినని సూచించుట కాతనికి తనఖడ్గము నందించెను. ఆయన విశాలహృదయముతో "నీవే ఉంచుకొనుము. నీ ఖడ్గము సైనికమర్యాదల నుల్లంఘించియుండలేదు." అని యనెనట. లేమన్ గారిప్పుడు జర్మనీలో ఖయిదీగా నున్నారు.

వాండరుగోల్జు. ఫీల్డుమార్షాల్:— జర్మనుసేనలో గొప్ప నాయకుడు. బెల్జియముకు గవర్నరు జనరలుగా నియోగింపబడెను. కాని యిప్పుడు కాన్స్టాంటునోపిలులో తురుష్క సైన్యముల కధిపతిగానుండి యుద్ధమును నడుపుచున్నాడు. డార్డినల్సు జలసంధి కిరుప్రక్కలనున్న కోటల నెంతో గట్టిపరచెను.

విక్టోరియా క్రాస్:—క్రిమియను యుద్ధమయిన తరువాత1850సం.లో నిపతక మేర్పరుపబడెను. అద్భుత ధైర్యకార్యములకు మాత్రమే సత్కృతుగా సైనికులకు నావికులకు ఒసంగబడుచుండును. బ్రాంజిలోహముతో చేయబడును. విక్టోరియా క్రాసు సంపాదించిన వాడు బ్రిటిషు సామ్రాజ్యమునందంతటను గౌరవింపబడుచుండును.

వియోగవేతనము:—భర్తలు సేనలోగాని నావలలోగాని యుద్ధముజేయుచున్నంతకాలమును వారికొసంగబడు జీతములుకాక భార్యలకు వారము 1 కి బ్రిటనులో రు.9-6-0లు వేతన మొసంగబడును. ఇందులో రు. 2-10-0 లు మాత్రము సైనికుని జీతమునుండి తీసి యియ్యబడును. నలుగురుబిడ్డలవరకు బిడ్డ 1 కి రు. 1-14-0 లును, అటుపయిననున్న బిడ్డలకు రు 1-8-0 లును వారమున కొసంగబడును.

వియాలి, అడ్మిరలు:—ఇటలీవారి యుద్ధనౌకాశాఖాధ్యక్షుడు. ఈయుద్ధములో ఆస్ట్రియావారి యుద్ధ

నౌకలు నిర్మించు ప్రదేశము నప్పుడే పట్టుకొని, 14 అన్ని రకముల యుద్ధనావలను ఇటలీకి దీసికొని, పోయెను.

విమానములందుండు ఆయుధములు:---ఉక్కుటమ్ములు:—ఒక్క అమ్ము 2½ తులముల బరు వుండును. 1000 అమ్ముల నొక్క పెట్టెలోపెట్టి శత్రుసైన్యముల మీఁద ఫ్రెంచి వైమానికులు చల్లుచుందురు. భూమి మీఁదికి వచ్చునప్పు డొక్కొక బాణము 100 రతుల బలముతో వచ్చి స్వారిని, గుఱ్ఱమునుగూడ చీల్చుకొని పోవును. ఇట్టిపెట్టె లనేకములు ప్రతివైమానికుఁడును గొంపోవుచుండును.

సబ్మెరయినులు:— మొట్టమొదటి సబ్మెరయిను ఇంగ్లీషువారివలన1901-వ సం. నవంబరు 2వ తేదినిర్మింపబడెను. మొట్టమొదట వీని శక్తినిగురించి చాలమంది కనుమానములు కలిగినను ఈ యుద్ధములో సబ్మెరయినులుచేయుచున్న ఘోరకార్యములవలన అట్టి అనుమానము లన్నియు అంతరించినవి. ఇది ఉక్కుతో చేయబడి పొగచుట్ట ఆకారమును గలిగియుండును. నీటిలోనికి మునుగుటకయి బోటులోపల నున్న తలుపులను తెరచెదరు. అప్పుడు నీరు కొన్ని తటాకములలో నిండును. అంతట పడవ మునుగును. నీటిని పదినిమిషములలో పారబోయగల సాధనమువలన తేలికగా కావలసివచ్చినప్పుడు బోటు సముద్రముపయికి వచ్చును. కిరోసినాయిలు నుండుటవలన సబ్మెరయినులు నడుపబడుచున్నవి. కాని బొగ్గువలనగాదు. నీటిలో మునిగి యున్నప్పుడిందుండు విద్యుచ్ఛక్తి యింజను పనిచేయును. సబ్మెరయినులలోని కిరోసినాయిలు చెరువులు నిండియుండెనేని మూఁడు వేల మైళ్లు గంటకు 21 మైళ్ళ చొప్పున ప్రయాణము జేసి రాగలవు. వీనిలో నీటిబరువు 2000 టన్నులుండును. సుమారు నలువదిమంది మనుష్యులకు పీల్చుటకయి కావలసిన గాలి కొన్నిగదులలో వత్తి యుంచబడును. కాన వారికి నిర్మలవాయువు లేదను భయము లేదు. ఈబోటులకు కొనింగు టవరను శిఖరముండును. అది యొక తెరచాప కొయ్యవలె నీటిపై భాగమున నెల్లప్పుడును కనబడుచుండును. దీనిలోనే పెరిస్కోప్ అను ఒక యంత్రము కలదు. ఈ పెరిస్కోపు సులోచనములవంటిది. నీటి పైభాగమునం దేమి జరుగుచున్నదియు దీనివలన బోటులోనివారు తెలిసికొనుచుందురు. ఒకవేళ పూర్తిగా శత్రువులకు కనపడకూడదనినచో శిఖరమునుగూడ నీళ్ళలో ముంచవలయును. అప్పుడు సబ్మెరయిను కన్నులు మూసికొనిపోవు మనుజునివలెనే సముద్రములోపల నడవవలయును. వీనియందు 6 టార్పెడో గొట్టము లుండును. ఆగొట్టములనుండియే టార్పెడో శత్రునావపయిని ప్రయోగింపబడును. ఒక్క టార్పెడో విలువ 1 లక్ష రూపాయలు మొదలు 1 లక్ష 50 వేల రూపాయలవర కుండునట. 12 రతుల గుండును ప్రయోగింపగల నాలుగు ఫిరంగులును వీనియందుండును.

సాంసనోఫ్. జనరలు:—ఆగస్టు 1914లో తూర్పు ప్రష్యాపైన వెడలిన జనరలు రెన్నెన్ కాంఫుగారికి చాల సాయము చేసెను. ఇంతకుముందు రష్యా జపాను యుద్ధములో కీర్తిగడించినవాఁడు. టానెన్ బర్గువద్ద జరిగిన ఘోరయుద్ధములో మృతినొందిన రష్యను జనరలులు ముగ్గురిలో నొక్కఁడు.

సాలాంద్ర. సినర్:—ఇటలీకి ముఖ్య మంత్రి. పోపు మొదలగు మతాధిపతులును మరి యితర గొప్పవారును యుద్ధము వల దని తమశక్తి కొలఁది నివారించినను, లెక్కసేయక ఇటలీనుండి యిదివఱకు ఆస్ట్రియా యపహరించిన రాష్ట్రములను తిరిగి సంపాదించి ఇటలీకి శాశ్వతకీర్తి నార్జించుటకయి యుద్ధములోనికి దిగెను. ప్రజల కాతనియందు గౌరవము మెండు.

స్మిత్ డోరియన్. జనరలు:—వయస్సు 56 వత్సరములు. తన జీవితకాలములో నిప్పటికి పది యుద్ధములలోనయిన బోరిన రణవీరుఁడు. దక్షిణాఫ్రికా యుద్ధములో ప్రసిద్ధిపడసెను. మాన్సునుండి ఇంగ్లీషుసేనను నియుద్ధములో హతముగాకుండ బహు తెలివితేటలతో రక్షించి మార్నెవరకును తీసికొనిపోయిన ధీరుఁడు. ఇంగ్లీషువారి రెండవసేన కధ్యక్షుఁడు.

సింగ్టా:—1898 లో ఇద్దరు జర్మనుమిషనరీలను చైనావారు చంపినారను మిషమీద వారితావునుండి జర్మనీవారు 117 చతురపుమైళ్ళభూమి నపహరించిరి. అదియే కియోఛాజిల్లా. దానికి ముఖ్య రేవుపట్టణము సింగ్టా. దీనిని జర్మనులు బహు దిట్టముగా బలపఱచి యుద్ధనావలకునికిపట్టుగా పసిఫిక్ సముద్రములో జేసిరి. చేపలగ్రామమునుండి ఐశ్వర్యవంతమయిన రేవుపట్టణముగా మారెను. చక్కని భవనములును, బాటలును గలవు.

సైనికోద్యోగ చిహ్నములు:— ఈ చిహ్నములను కోటుకు చేతులవద్దగాని, భుజమువద్దగాని, వక్షస్థలమునగాని ధరించెదరు. సెకండు లెఫ్టినెంటుకు 1 నక్షత్రము, లెఫ్టినెంటుకు రెండు నక్షత్రములు, కెప్టనుకు మూడు, మేజరుకు కిరీటము, లెఫ్టినెంటు కర్నలుకు 1 కిరీటము 1 నక్షత్రము, కర్నలుకు 1 కిరీటము రెండు నక్షత్రములు, బ్రిగేడియరు జనరలుకు వక్షస్థలమున అడ్డముగా దాటునట్టి ఖడ్గములు, మేజరు జనరలుకు ఖడ్గములు, నక్షత్రము, శంగోలును, లెఫ్టినెంటు జనరలుకు పైవన్నియు పయిగా నొక కిరీటము, జనరలుకు లెఫ్టినెంటు జనరలుకున్నవి గాక పయిన నొక నక్షత్రము, ఫీల్డు మార్షలుకు అడ్డ శంగోలులు, కిరీటము, పతకముల మాల యుండును.

శ్రాప్నెల్:—ఇది షెల్లు మోస్తరుగానే యుండును గాని పైకప్పు బహుపలచగానుండి ఎక్కువ సీసపుగుండ్లు పోయుటకు వీలుండును. బ్రిటిషు శ్రాప్నెలులో 375 గుండ్లుండును. గురికి కొంచెము దూరముండగా భగ్గున బ్రద్దలయి గుండ్లను నానాముఖముల చల్లును. మనుష్యులను చంపుటయందు శ్రాప్నెలు బహు ప్రయోజనకారిగాని యిండ్లకెట్టి యపాయమును గలుగజేయజాలదు.

షెల్లుపిస్టలు:—జెప్పెలిను మోడలపయి ప్రయోగించుటకు నిర్మింపబడినవి. ఒక్కగుండు వీనినుండి జెప్పెలినుకు దగిలినయెడల నది నిరర్థకమగును.

షెల్లు:—ఇది విడ్డయిటుతో గాని తుపాకిమందుతోగాని చేయబడును. 10 రతులషెల్లుమొదలు 1టన్ను బరువుగల షెల్లువఱకును ఫిరంగులనుండి ప్రయోగింపవచ్చును. ఈషెల్లులు విడువబడిన పిమ్మట భూమిమీదపడి ఆదెబ్బకు బ్రద్దలయి లోపల 100 మొదలు 1000 వఱకుండు సీసపుగుండ్లను శత్రువులమీదను, గుఱ్ఱములమీదను వెదజల్లి చంపివేయును. పెద్దషెల్లులు ఇండ్లను ధ్వంసముచేయగలవు. రెండవ రకపు షెల్లులు ఫిరంగి నుండి విడువబడగానే వానికొకప్రక్కనుండు దారమునకు నిప్పంటుకొనును. అనిప్పు అర సెకండులోనో, ఒక సెకండులోనో, లేక కొన్ని సెకండులలోనో షెల్లులో ప్రవేసించి దానిని బ్రద్దలగునట్లు చేయును.

హాలండు రాణి:— ఈమె పేరు విల్హెల్మినియా. ప్రిన్సు హెన్రీని పెండ్లియాడెను. హాలండు, జర్మనీకి సామీప్యమున నుండుట చేత ఎప్పుడేమి మూడునోయని సైన్యమును, యుద్ధనౌకలను సిద్ధము జేసికొని యున్నది.

హాల్డేను ప్రభువు:—బ్రిటిషు యుద్ధాంగమంత్రిగా 6 సం. లుండి ఈ యుద్ధమునకు సేనను బాగుగా తరిఫీయతు చేయించెను. జర్మను భాషలో గొప్పగా పరిశ్రమ జేసిన పండితుడు. తత్వశాస్త్రమునందు పేరు పొందిన వేత్త. మూడు సంవత్సరము లార్డు ఛాన్సెల్లరు (ప్రీవీకౌన్సిలులో మొదటి న్యాయాధిపతి) పనిని జేసెను. ఇప్పుడు మంత్రులలో మార్పు జరుగుటవలన నా పనిని మానుకొనెను.

హార్కోర్టు లూయి:—ఈయన తండ్రి గ్లాడ్ స్టన్ గారి కాలమందు మంత్రిగా నుండెను. ఈయనయు లిబరలు ప్రభుత్వములో బ్రిటిషు అధినివేశములకు మంత్రిగా నుండెను. ఇప్పుడన్ని కక్షులవారును మంత్రులగుటవలన నీయన తన యుద్యోగమును బోనర్ లాగారి కొప్పజెప్పెను.

హామిల్టను జనరలు సర్ ఐయన్:—అఫ్ఘను యుద్ధము, బోయరు యుద్ధము, చిత్రల్ దండ యాత్రలలో నుండెను. సైనిక వ్యవహారములను గురించి ఉత్తమ గ్రంథములను వ్రాసెను. ఇప్పుడు డార్డనెల్సు జల

సంధి కోటలపయికి పంపబడిన మిత్రమండలి సేన కధ్యక్షుడు. కాన్స్టాంటినోపు లీయన చేతిలో బడవలసియున్నదట.

హిండెన్‌బర్గు. ఫీల్డుమార్షల్:— 1870 లో ఫ్రెంచివారితో బోరిన సైనికులలో నొక్కడు. యుద్ధారంభమున నుపకారవేతనమును గైకొనుచుండెను. కెయిజరుగారు రష్యా నోడించు పనిని బెట్టి తూర్పు సేన కధ్యక్షుడుగా జేసెను. టన్నెంబర్గు వద్ద జనరలు రెన్నెన్ కేంపు నోడించెను. రష్యను సేనలను తూర్పు పరిష్యాలో నోడింప జేసి సరస్సులలోనికి త్రోసెను. పోలండులో రష్యనులపయి తుదికి వార్సాను పట్టుకొనునంత విజయమును పొందెను. రష్యనులను విస్ట్యులా వార్టా ప్రాంతములందును తరిమివేసెను. కాని రష్యను లీతని సైన్యమును రెండుగా జీల్చి చాలభాగమును నాశము జేసిరి. ఈతడు తూర్పు రంగమున పొందిన జయములతో జర్మనీ దేశమంతయు ప్రతిధ్వనించుచున్నది. ఈతనిని దేవతగా ప్రజలు పూజించుచున్నారు. హిన్డెన్‌బర్గుగారి నభినందించుచు పంపబడిన తంత్రి వార్తలను సందకేయుటకయి టెలిగ్రాఫు శాఖ వారికి శక్తి లేక పోయినదట.

హేగ్. సర్ డౌగ్లస్:—ఫ్రాంసులో ఇంగ్లీషువారి మొదటి సైన్యమున కధిపతి. ఏన్ యుద్ధములో బ్రిటిషుసేన నతిసాహస పరాక్రమములతో బోరించెను. ఈయుద్ధమును నడపుచున్న బ్రిటిషుజనరలులలో సర్ జాన్ ఫ్రెంచిగా రంతవాడు. ఇంతకుముందు సూడాన్, బోయరు యుద్ధములలో పోరు సలిపెను. ఇండియాలో సర్వ సేనాధిపతి యుద్యోగమును మూడేండ్లు జేసెను. యుద్ధారంభమునకు బూర్వము అల్డరుషాటులోని సేనల కధిపతిగానుండెను. ఈయన స్కాట్లండువాసి.

హైందవ మహారాజులు:—70 సం.ల వయస్సుగల సర్ ప్రతాపసింగు, అతని అన్న కొడుకు 16 సం. ల ప్రాయమున్న జాడ్పూరు మహారాజు, బికనీరు, జాంనగరము, ఇడన్ మహారాజులును మరికొంత మందియు శత్రువులతో బోరుటకు వెళ్లిరి.

హైందవ సేన:— పదాతులు 138 బటాలియనులు, 40 రెజిమెంటులు, సాపర్సు మైనర్సు 27 కంపెనీలు, పర్వత బేటరీలు 12 ను గలవు. మొత్తపు సంఖ్య 1,59,000 మంది సైనికులు. రిజర్వులో నుండువారు 35,000. పదాతులకు జీతము నెల 1-కి 11 రూపాయలు. ఈ జీతముతో పొట్టబోసికొని కొన్ని సైనిక యుడుపులనుగూడ కొనవలయును. సాధారణముగా 32 సంవత్సరములు వీరు కొలువుచేసి పింఛను పుచ్చుకొనెదరు. గుఱ్ఱమును స్వంతముగా దెచ్చుకొని దానిని పోషించుకొనుచుండు రౌతునకు నెల 1-కి 35 రూపాయలు జీతమొసంగబడును. గుఱ్ఱము లేనివానికి 13½ రూప్యములు.

# టర్కీ రాజ్యము

ఈ రాజ్యముయొక్క ప్రాచీనచరిత్ర మత్యంత ముఖ్యమైనది. సర్వియా మాంటినిగ్రో ఆష్ట్రియాల చరిత్రములను పఠించినవారి కిది స్పష్టము కాగలదు. దీనికి సంబంధించినది యూరపులోని టర్కీ మాత్రమె కాదు; ఆసియాలోని టర్కీయు, ఆఫ్రికాలోని ట్రిపోలీ భాగ్యాలును కూడ దీనికి చెందియుండినవియే. యూరపులోని టర్కీలో బాల్కను ద్వీపకల్ప మంతయు చేరియుండెడిని. ఏషియాలోని టర్కీలో అరేబియా, ఆర్మేనియా, ఏషియామైనరు, పెలస్టయిను, సిరియాలు చేరియున్నవి. 1898వ సం. లో వీరికి చెందియుండిన క్రీటునకు గ్రేటుబ్రిటను ఫ్రాన్సు ఇటలీ రష్యాల యాజమాన్యముక్రిందను, టర్కీవారి నామమాత్రపు టధికారముక్రిందను స్వాతంత్ర్య మీయబడెను. ఈ రాష్ట్రవాసులలో పెక్కండ్రు బలిష్ఠులును ప్రమతక్షులను స్వాతస్సిద్ధ శూరులును నగువారు ఏషియామైనరులోఁ గలరు. వీరు సంఖ్య కనేక లక్షలుండి, తక్కిన తుర్కీ రాష్ట్రప్రజలలో ప్రతి జాతివారికంటెను మొత్తముకంటెను పెక్కుండుగఁ గలరు. సామాన్ సైప్రస్ నివాసులవలెఁ గాక, వీరు స్వయముగా తుర్కీ ప్రభుత్వము (పోర్టీ) క్రింది పరిపాలనలో నున్నవారు. దీని ప్రాంతములందు ఎఱ్ఱసముద్రము పరిసిష్ట సింధుశాఖ గలవు. ఈజిప్టు నామమాత్రమున టర్కీప్రభుత్వమునకు చేరిన దయినను 1841వ సం. నుండియు స్వతంత్రముగనే యుండి తుదకు 1881వ సంవత్సరములో బ్రిటీషువారి యధినివేశ మయినది.

1912-13వ సం. లో జరిగిన టర్కీ బాల్కను యుద్ధములో యూరపులోని భాగము చాలవఱకు కంతరించినది. ప్రస్తుతపు యూరోపియను టర్కీ క్రింద యేజియన్ సముద్రతీరమందలి ఈనాస్ కడ్డనుండి ఏద్రియనోపిలుమీఁదుగ నల్లని సముద్రతీరము నందలి మిడియాపజకును గల రేఖకు దక్షిణభాగమున నుండు దేశము మాత్ర మున్నది. 1911-12వ సం. లో ఆఫ్రికాలో టర్కీకిఁ గల ట్రిపోలీ సిరెనెయికాలను ఇటలీవారు లాగుకొనిరి. టర్కీ ప్రస్తుతయుద్ధములో 1914వ సం. నవంబరు నెలలో శత్రుమండలివారి పక్షమున చేరినది. ఈ యుద్ధములో వీరికి కలుగఁబోవు ఫలితముయొక్క చిహ్నములు అనుదినము తంత్రీవార్తలవలన పాఠకు లూహించుచునే యున్నారు.



సూయజికాలువను గమనించుచున్న ఉష్ట్రమండలివారి సైనికుడు

# ఇటలీ—యుద్ధరంగము

ప్రస్తుత మాస్ట్రియా దేశములోని భాగములగు ట్రీస్టు, టైరోలు పరగణాలు పూర్వము ఇటలీ దేశమునకు చెందినవి. ట్రీస్టు పరగణా ఇటలీ సరిహద్దులకు తూర్పున, టైరోలు ఇటలీకి పడమట గలవు. ట్రీస్టు పరగణాకు వెనిస్ నుండి సేన పంపబడినది. టైరోలుకు ట్రెంటినోనుండి పంపబడెను. ఇటలీ బలహీనముగా నున్నపుడా పరగణాలను ఆస్ట్రియా అపహరించెను. ఆల్సేసు-లోరేయిను పరగణాలను జర్మనులవద్దనుండి సంపాదించుటకయి ఫ్రెంచివారు ఎంతగొప్ప దీక్షను బూనియున్నారో అంత దీక్షను ఇటాలియనులు తమ రెండు పరగణాలను సంపాదించుటకయి ఇంతకాలమునుండియు వహించిరి. ఈ రెండుపరగణాల ప్రజలలో 100 కి 80 పాళ్లు ఇటాలియనులే యని ప్రామాణావసరములేదు. ఈయుద్ధ ప్రారంభమునుండియు ఇటలీదేశము ఆస్ట్రియా జర్మనీలతో చేరక తనపరగణాలను సంపాదించు కొనుటకయి యుద్ధసన్నాహములను చేయుచు, ఆస్ట్రియా ఎట్టిరాజీకయి



నను వచ్చునేమో యని రాయబారములు 10 మాసముల వఱకును చేసెను కానివారికిసంధి షరతులు కుదరకపోవుటవలనను, ఇటలీ ప్రజలు యుద్ధము యుద్ధమని ఘోషించుచుండుటవలనను మంత్రులిక యెంతమాత్ర మాగుటకు వీలులేక కత్తిని దూయవలసిన వారయిరి. ఆస్ట్రియా కింకొకప్రక్కనుండి బలవంతమగు శత్రువు తగులుకొనుట వలన రష్యా యొక్క భారము కొంతవఱకు తగ్గగలదు. మిత్రమండలి వారి పక్షమున నొక గొప్ప దేశము చేరుటవలన వారి పక్షము మరింత బలపడినది.

ఇటలీకి తూర్పున జ్యూలియన్ అల్ప్సు కొండలు, ట్రీస్టు రాష్ట్రము కలవు. ఈ కొండలు సముద్రపు టొడ్డున నున్న ట్రీస్టునగరము వఱ కేటవాలుగానుండును. ఈ కొండలలోనే ముఖ్యమయిన ఇటాలియను సేన ప్లెజ్జో, 7800 అడుగుల యెత్తున నున్న మాంటు నీరో, కొలారియ, కాపోరెట్టో, టోల్మినో, ఇసోంజోనదీ ప్రాంతమ్ము, సాక్ ఫ్లోరియన్, గోరిజియ, గ్రాడిస్కా, మాన్ ఫాల్కోన్ అను చోటుల చేర్చబడియున్నవి. మాన్ ఫాల్కోను మీద ఇటాలియను యుద్ధనావలును ఫిరంగులను గాల్చి టార్పిడో స్థానములను పాడు చేసెను. ఈ తూర్పు సైన్యము యొక్క గమ్యస్థానము ట్రీస్టు నగరము. ట్రీస్టు రాష్ట్రము. ఇసోంజో నదీదేశము. ఇప్పటికి సేన అనేక వేల అడుగులను యెత్తునున్న కొండలకు ప్రాకి గొప్ప సైన్య సాధనములతో ఆస్ట్రియనులపై నపహరించిన ఫిరంగుల శోధించి పారదోలుచున్నది. ట్రీస్టు నగరపు రయిలు రోడ్లు బాంబులవలన పాడు చేయబడుట వలన బాహ్య ప్రపంచముతో సంబంధము లేకుండ చేయబడినది. ఇది పూర్వము ఇటాలియనుల దేశమగుట వలన ఇటాలియను సేన ఎచ్చటికి వెళ్లినను సోదరులవలె నాదరింపబడుచున్నారు. ఈ యుద్ధములో నతి కఠినమయిన దెబ్బ యిప్పటికి ఈ తూర్పుసేనవలననే ఆస్ట్రియనులకు తాకుచున్నది. గలీషియా రంగమునుండి సేనలు ఫిరంగులను పోవుటకయి ఈ రంగమునకు తీసికొని రావలసి వచ్చినది. ఆస్ట్రియాకు యుద్ధనావల స్థానమగు పోలామీద ఇటాలియను విమానములు బాంబులను వేసి చాల నష్టమును గలుగజేసెను.

ఇటలీ పశ్చిమసేన ట్రెంటినో రాష్ట్రమునుండి బయలుదేరి దాని పయినున్న ఆస్ట్రియా వారి టైరోలు రాష్ట్రములో పోరుటను ప్రారంభించినది. కాని 10,000 అడుగుల యెత్తున యిచ్చట కార్నిక్ అల్ప్సు కొండలుగలవు. రయిలు మార్గములులేవుగదా, మంచి బాటలయినలేవు. దేశము పర్వతమయమగుటచేత ఆస్ట్రియను లనేక సంవత్సరముల నుండియు దృఢమయిన కోటలను గట్టి, కందకములను త్రవ్వి, ఫిరంగులను నెలకొలిపి, ఇటలీని రూపుమాపుటకయి సన్నద్ధమయి యున్నారు. అందుచే యిచ్చట యుద్ధము బహు నెమ్మదిగా జరుగును. ఎవరికి హెచ్చు దూరము పారగల ఫిరంగులును, ముఖ్యముగా యుద్ధ పరికరములును నుండునో వారిదే ఈ దిక్కున విజయము. ఈ టైరోలు-ట్రెంటినో ప్రాంతమున నిటాలియనులు అలాను పట్టుకొని స్థిరవాసమేర్పరచిరి. ఇద్రో సరస్సుమీదనున్న స్టోరో నాక్రమించుకొనిరి. గార్డా సరస్సుకు తూర్పున నున్న ప్రదేశములో చేరి, ట్రెంటు కయిదుమైళ్ల దూరమున నున్న రొగ్గోను పట్టుకొనిరి. వారికెదుర్కొన్నసేన లావరోన్-ఫోల్గారియా పంక్తులమీద కాల్చుచున్నది. ఆస్ట్రియా వారి రోవరెడో కోటమీద గాల్చగల వేరొక కొండను వశముచేసికొనిరి. కాని యింతవఱకును పశ్చిమమున జరిగిన పోరాటములు పిల్ల పోరాటము లనియే చెప్పవలయును. రోవరెడో ట్రెంటుకోటలు ఇటాలియనులకు పడినప్పుడు టైరోలు రాష్ట్రములో కాలుకుదుర్చుకొనినారని చెప్పవచ్చును. ఇచ్చట బెల్జియము ఫ్రాంసులలోవలె కందకముల యుద్ధము ప్రారంభమగును. అప్పుడెన్ని మాసములు పోరినను ఏపక్షము వారికయినను 10 మైళ్ల దేశము దొరకుట దుర్లభము.



KING OF ITALY

ఇటలీ రాజు



QUEEN OF ITALY

ఇటలీ రాణి



DUKE OF ABRUZZI

అబ్రుజ్జీ ప్రభువు



THE POPE

రోమను కాథలిక్కుల మతగురువగు పోపు

SIGNOR SALANDRA



సినర్ సాలంద్ర. ముఖ్యమంత్రి

ADMIRAL VIALE



అడ్మిరలు వియేలి. యుద్ధనౌకాశాఖాధ్యక్షుడు

DUKE OF AOSTA



ఓస్టప్రభువు. సేనానాయకుడు

M. GIOLITTI



ఎం. గ్యోలిట్టి. విదేశాంగమంత్రి

GENERAL CANEVA



జనరలు కనేవ. సైన్యాధిపతి

DUKE OF GENOA



జెనోవాప్రభువు. అడ్మిరలు

